పఱపు పాన్పనఁ దగు శయ్య § ఫాలనేత్ర. 32

టీ. పన్నుండెను, ॥పా॥ పండుండెను, పండెను, పవ్వడించెదు, పరుండెను, పవ్వళించెను, అత్తమిల్లెను-ఈ ౭ శయనించె ననుటకుఁ బేళ్లు. మెత్త సెజ్జ (ప్ర. శయ్య), పఱపు, పాన్పు - ఈ ౪ శయ్య పేళ్లు.

తే. ఒప్పు ధ్వనిపేళ్లు రొద యన § నులివు నాఁగ
సద్దనంగను గూఁత నాఁ § జప్పు డనఁగ
నలుకు డన రోదనము సేసె § ననుట కాఖ్య
లెసఁగు నఱచెను వాపోయె § నేడ్చె ననఁగ. 33

టీ. రొద, ఉలివు, సద్దు, కూఁత, చప్పుడు, అలుకుడు-ఈ ౬ ధ్వని పేళ్లు. అఱచెను, వాపోయెను, ఏడ్చెను-ఈ ౩ రోదనము చేసెననుటకుఁ బేళ్లు.

క. అగుఁ బేళ్లు నీరువట్టన
దగ దప్పియు దూప యనఁగ § దాహంబునకుఁ
నగవు నగు నవ్వు నవు నా
నగు నాఖ్యలు హాసమునకు § నగజాధీశా. 34

టీ. నీరువట్టు, దగ, దప్పి, దూప - ఈ ౪ దాహమునకుఁ బేళ్లు. నగవు, నగు, నవ్వు, నవు - ఈ ౪ హాసము పేళ్లు.

క. చాగము నాఁ బుడు కనఁగా
నీగి యనఁగ నిడుట యనఁగ § నీవి యనంగాఁ
దేగము నాఁ బెట్టుడు నాఁ
ద్యాగమునకు నాఖ్య లగుచు § ధరఁ బరఁగు శివా. 35

టీ. చాగము, పుడుకు, ఈగి, ఇడుట, ఈవి, తేగము, పెట్టుడు-ఈ ౬ త్యాగము పేళ్లు.

ఆ. ఎలసె బెరసె హత్తెఁ § గలసె నదికెఁ జెందెఁ
బొందె దొరసెఁ గూడెఁ § నొందె నెనసె

నన(గ సక్తమయ్యె । ననుటకు నివి యాఖ్య
లగు గిరీశ యీశ । యభ్రకేశ. 36

టీ. ఎలసెను, బెరసెను, హత్తెను, కలసెను, అదికెను, చెందెను, పొందెను, దొరసెను, కూడెను, ఒందెను. ఎనసెను, ఈ ౧౧ సక్తమయ్యెననుటకుఁ బేళ్లు.

ఆ. ఎడసెఁ బాసె వేఱు । పడెఁ బురివిచ్చె నా
నలరు భేదమయ్యె । ననుట పేళ్లు
స్వవశమయ్యె ననుట । కవుఁ బేళ్లు లోనయ్యె
నగ్గమయ్యె ననఁగ । ననమనేత్ర. 37

టీ. ఎడసెను, పాసెను, వేఱుపడెను, పురివిచ్చెను-ఈ ౪ భేదమయ్యె ననుటకుఁ బేళ్లు. లోనయ్యెను, అగ్గమయ్యెను-ఈ ౨ స్వాధీనమయ్యె ననుటకుఁ బేళ్లు.

ఆ. అగు గృహీతమయ్యె । ననుటకుఁ బేళ్లగ
పడియెఁ జేపడియెను । బట్టువడియెఁ
జిక్కువడియెఁ దగిలెఁ । జిక్కెఁ దగుల్పడె
ననఁగ నగనివేశ । యభ్రకేశ. 38

టీ. అగపడియెను, (అగ్గముపడియెను) అధీనమయ్యెను, చేపడియెను, పట్టువడియెను, చిక్కువడియెను, తగిలెను, ॥పా॥ తవిలెను, చిక్కెను, తగుల్పడెను - ఈ ౮ గృహీతమయ్యెననుటకుఁ బేళ్లు.

తే. అనియె నొడివె వక్కాణించె । నాడెఁ జెప్పె
వినిచె వాక్రుచ్చెఁ బలికె నాఁ । జను వచించె
ననుట కాలించె నాలకిం । చెను వినె నన
నలరు నవధరించె నటంట । కాఖ్య లీశ. 39

టీ. అనియెను, నొడివెను, వక్కాణించెను, ఆడెను, చెప్పెను, వినిచెను, వాక్రుచ్చెను, పలికెను - ఈ ౮ వచించె ననుటకుఁ బేళ్లు. ఆలించెను, ఆలకించెను, వినెను - ఈ ౩ అవధరించె ననుటకుఁ బేళ్లు.

క. కనియెం జూచెను గాంచెను
గనుఁగొనెఁ గన్గొనె ననంగఁ । గలయవి పేర్లై
చను వీక్షించె నటంటకు
ఘనతరగోరాజగమన । కాయజదమనా. 40

టీ. కనియెను, చూచెను, కాంచెను, కనుఁగొనెను, కన్గొనెను - ఈ ౫ ను వీక్షించె ననుటకుఁ బేర్లు.

క. చనుఁ గృతగమనుఁడ నయ్యెద
ననుటకు నామంబు లగుచు । నవని నరిగెదం
జనియెదఁ బోయెద నేఁగెదఁ
బనివినియెద ననెడునట్టి । పలుకులు రుద్రా. 41

టీ. అరిగెదను, చనియెదను, పోయెదను, ఏఁగెదను, పనివినియెదను- ఈ ౫ కృతగమనుఁడ నయ్యెద ననుటకు పేర్లు.

ఆ. ద్విగుణమున కభిఖ్య । లగు నిబ్బడిమ్మడి
జంట దంట దుగయు । జమిలి రెట్టి
యినుమడి యన మిథున । మున కాఖ్య లగు జోడు
దోయి కవ యనంగ । ధూతకలుష. 42

టీ. ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగ, జమిలి, రెట్టి, ॥పా॥ రెంట, ఇనుమడి-ఈ ౯ ద్విగుణమునకుఁ బేర్లు. జోడు, దోయి, కవ-ఈ 3 ను మిథునమునకుఁ బేర్లు.

సీ. ఒం డొక్కఁ డొకటి యొ । క్కరుం డన నగు నేక
మీరు రెం డిరు నాఁగ । నెసఁగు ద్వయము
తిగ మూఁడు మూ ర్నాఁగఁ । దగుఁ ద్రయి తీపంచ
నలు నాల్గు చౌ యన । నగుఁ జతుష్క

మెసఁగుఁ జౌపంచ యైదే ననఁ బంచకం
బా ఆఱుమూఁడిత్తి గనఁగ నొప్పు
షట్కంబు ఋషిసంఖ్య సత చక్కపగడ యే
డన నొప్పు నష్టసంఖ్యను బేళ్లు
తే. దనరు నిరునాలు నెనిమిది దచ్చి యనఁగఁ
బరఁగు నీరాఱు పండ్రెండు బార యనఁగ
ద్వాదశమునకు నాఖ్యలు ధరణియందు
శైలజానాథ ప్రమథసంచయసనాథ. 43

టీ. ఒండు, ఒక్కఁడు, ఒకటి, ఒక్కొండు-ఈ ర ఏకము పేళ్లు. ఈరు, రెండు, ఇరు-ఈ 3 ద్వయము పేళ్లు. తిగ, మూఁడు, మూరు-ఈ 3 త్రియము పేళ్లు. తీవంచ=మూఁడునొకటియును, నలు, నాల్గు, చౌ-ఈ రచతుష్కము పేళ్లు. చౌపంచ=నాల్గునొకటియును, ఐదు, ఏను-ఈ 3 పంచకము పేళ్లు. ఆఱు, ఇరుమూఁడు=రెండుమూళ్లు, ఇత్తిగ (ఇరు+తిగ) = రెండుమూళ్లు-ఈ 3 షట్కముపేళ్లు. సత (ప్ర. సప్త), చక్కపగడ=ఆఱునొకటియును, ఏడు. - ఈ 3 సప్తసంఖ్యపేళ్లు. ఇరునాలుగు=రెండునాల్గులు, ఎనిమిది, దచ్చి-ఈ 3 అష్టసంఖ్యపేళ్లు. ఈరాఱు=రెండాఱులు, పండ్రెండు, బార - ఈ 3 ద్వాదశసంఖ్య పేళ్లు.

తే. జరిగె నూడెను జాఱెను నుఱికె వెళ్లెఁ
బాఱెఁ బఱచెను దొలఁగె నర్వలుకు లెల్ల
నవనిలోనఁ బలాయితుండయ్యె ననుట
కాఖ్యలై యొప్పుఁ జంద్రరేఖావతంస. 44

టీ. జరిగెను, ఊడెను, జాఱెను, ఉఱికెను, వెళ్లెను, పాఱెను, పఱచెను, తొలఁగెను - ఈ ౮ పలాయితుఁడయ్యె ననుటకుఁ బేళ్లు.
క. వేంచేసెను వచ్చెం జను

దెంచెను విచ్చేసె నరుగుదెంచె ననఁగ నే
తెంచె నన నయ్యె నాగతుఁ
డంచుం బలుకుటకు నాఖ్య లంబరకేశా. 45

టీ. వేంచేసెను, వచ్చెను, చనుదెంచెను, విచ్చేసెను, అరుగుదెంచెను (రూ. అరుదెంచెను), ఏతెంచెను (రూ. ఏఁగుదెంచెను)- ఈ ౬ ఆగతుండయ్యె ననుటకుఁ బేళ్లు.

తే. నాఁటిసుత నాఁటనుండియు నాఁటఁగోలె
నాఁటఁబట్టి నాఁడుమొదలు నాఁగ నాహ్వ
యమ్ము లయ్యెఁ దదారభ్య యనుట కవని
వినుతకరుణాసనాథ శ్రీవిశ్వనాథ. 46

టీ. నాఁటిసుత, నాఁటనుండి, నాఁటఁగోలె, నాఁటఁబట్టి, నాఁడు మొదలు - ఈ ౫ తదారభ్య యనుటకుఁ బేళ్లు.

తే. వైరమునకును ధర సమాహ్వయము లమరుఁ
గంటు పగ మచ్చరంబు సూ డొంటమి యన
వలపు కూరిమి మేలు నా నలరుఁ బేళ్లు
మోహమునకును శారదాంబుదనిభాంగ. 47

టీ. కంటు, పగ, మచ్చరము(ప్ర. మత్సరము), సూడు, ఒంటమి-ఈ ౫ వైరముపేళ్లు. వలపు, కూరిమి, మేలు - ఈ ౩ మోహముపేళ్లు.

క. పెనఁకువ జగడము కయ్యం
బని బవరము కలను చివ్వ యాలము పోట్లా
టన దురము పోరు నాఁగాఁ
జను యుద్ధంబునకుఁ బేళ్లు చంద్రార్ధధరా. 48

టీ. పెనఁకువ, జగడము, కయ్యము (ప్ర. కలహము), అని, బవరము, కలను, చివ్వ, ఆలము, పోట్లాట, దురము, పోరు. ఈ ౧౧ యుద్ధమునకుఁ బేళ్లు.

ఆ. సదమదంబుసేసెఁ జక్కాడె నుగ్గాడెఁ
జదిపెఁ బీఁచమడఁచెఁ జంపెఁ గెడపె
నుఱుముచేసెఁ ద్రుంచెఁ బరిమార్చెఁ దెగటార్చె
మన్నిగొనియెఁ దునిమె మడిపె ననఁగ. 49

తే. హతము గావించె ననుటకు నాఖ్య లయ్యె
మనిపె నేలెను బ్రతికించె మంచెఁ బ్రోచె
సాఁకె నన నొప్పు నాఖ్యలు సరవితోడ
నరయఁ బోషించె ననుటకు నంబికేశ. 50

టీ. సదమదంబుసేసెను, చక్కాడెను, నుగ్గాడెను, చదిపెను, పీఁచమడఁచెను, చంపెను, కెడపెను, నుఱుముచేసెను, త్రుంచెను, పరిమార్చెను, తెగటార్చెను, మన్నిగొనియెను, తునిమెను, మడిపెను-ఈ ౧౪ వధియించె ననుటకుఁ బేళ్లు. మనిపెను, ఏలెను, బ్రతికించెను, మంచెను, ప్రోచెను, సాఁకెను - ఈ ౬ పోషించె ననుటకుఁ బేళ్లు.

క. ధరలో శూరాహ్వయములు
పరఁగున్ మొనకాఁ డనంగ బంటనఁగాఁ బో
టరి యన వడిగలవాఁ డన
బిరు దన వాఁడిమగఁ డనఁగ భీమకపర్ది. 51

టీ. మొనకాఁడు, బంటు (ప్ర. భటుఁడు), పోటరి, వడిగలవాఁడు, బిరుదు, వాఁడిమగఁడు - ౬ శూరుని పేళ్లు.

తే. బాసట యనంగఁ దోడ్పాటు నా సమాహ్వ
యంబు లగుచుండు రెండు సాహాయ్యమునకు
నాఖ్యలు శుభంబునకును లగ్గనఁగ బాగ
నంగ మే లన లెస్స యనంగ నీశ. 52

టీ. బాసట, తోడ్పాటు - ఈ ౨ సాహాయ్యము పేళ్లు. లగ్గు, మేలు, లెస్స - ఈ ౪ శుభమునకుఁ బేళ్లు.

ఆ. కూలె నీల్గెఁ జచ్చెఁ § గాలంబుసేసెను
గెడసె సమసె నాఱె § మడిసెఁ జెల్లెఁ
బెద్దనిదురవోయె § బిద్దె దీరెను గంతు
గొనియె ననుట పేళ్ల§గును మృతునకు. 53

టీ. కూలెను, నీల్గెను, చచ్చెను, కాలంబుసేసెను, కెడసెను, సమసెను, ఆఱెను, మడిసెను, చెల్లెను, పెద్దనిదురవోయెను, బిద్దెను, దీరెను, గంతుగొనియెను-ఈ ౧౩ మృతుఁడయ్యె ననుటకుఁ బేళ్లు.

సీ. తిమ్మనైనది యనఁ § దిన్ననైనది యన
జానైన దనఁగ భా§గైన దనఁగ
నాణెమైన దన వి§న్నాణమైనది యన
మానైన దనఁగ లె§స్సైన దనఁగఁ
బిన్ననైనది యనఁ § జెన్నైన దన నలు
వైనది యనఁగఁ జె§లువైన దనఁగఁ
బొనరినయది యన § నొనరిన దనఁగఁ జొ
క్కటమైన దనఁగఁ జ§క్కని దనంగ
సొబగైన దనఁగను § సొంపైన దనఁ గోమ
రైనది యన గొన§బైన దనఁగఁ
దోరమైన దన సిం§గారమైనది యన
మేలైన దనఁగ మె§చ్చైన దనఁగ
తే. మురువుగలయది యొప్పైన § దొఱపుగలది
యందమైనది తనరిన § దలరినట్టి
దనఁగఁ బరఁగిన దనఁ బేళ్లు § దనరుచుండు
మంజులంబైన దనుటకు § మదనదమన. 54

టీ. తిమ్మనైనది, తిన్ననైనది, జానైనది, బాగైనది, నాణెమైనది, విన్నాణమైనది, మానైనది, లెస్సైనది, పిన్ననైనని, చెన్నైనది, నలువైనది, చెలువైనది, పొనరినయది, ఒనరినది, చొక్కటమైనది, చక్కనిది, సొబగైనది, సొంపయినది, కొమరైనది, నొనజైనది, తోరమైనది, సింగారమైనది, మేలైనది, మెచ్చైనది, ఘురువుగలయది, ఒప్పైనది, ఒఱపుగలది, అందమైనది, తనరినది, అలరినట్టిది, పరఁగినది-ఈ ౩౧ మనోజ్ఞమైనది యనుటకు పేళ్లు.

తే. కపుర మనఁ గప్పురం బనఁ గ్రప మనఁగఁ
బుడమిఁ గర్పూర మొప్పుఁ దాంబూల మొప్పు
వీడియము వక్కలాకులు విడెము తమ్మ
లంబు వీడెంబు వీడ్య మనం బురారి. 55

టీ. కపురము, కప్పురము, క్రపము, ఈ 3 కర్పూరము పేళ్లు. వీడియము, ॥రూ॥ విడియము, వక్కలాకులు, విడెము, తమ్మలము, వీడెము, వీడ్యము-ఈ ౭ తాంబూలమునకుఁ బేళ్లు.

తే. వెలయుచుండును సిరి లచ్చి కలిమి యనెడు
పేళ్ల సంపద యెద్దడి పేదఱికము
లేమి నిప్పచ్చరము నెవ్వ లేమి డనఁగ
నలరు దారిద్ర్యమునకు నాఖ్యలు గిరీశ. 56

టీ. సిరి (ప్ర. శ్రీ.), లచ్చి, కలిమి-ఈ 3 సంపదకు పేళ్లు. ఎద్దడి, పేదఱికము, లేమి, నిప్పచ్చరము, నెవ్వ, లేమిడి-ఈ ౬ దారిద్ర్యము పేళ్లు.

తే. మగతనం బన గం డన మగఁటిమి యనఁ
బౌరుషంబున కాఖ్యలై పరఁగుచుండు
నుక్కు చేగ దిటము చేవ యుదుటు గట్టి
దిట్ట ముఱిది బిగువు నాఁగ ధృతికిఁ బేళ్లు. 57

టీ. మగతనంబు, గండు, మగఁటిమి-ఈ 3 పౌరుషము. ఉక్కు, చేగ, దిటము, చేవ, ఉదుటు, గట్టి, దిట్టము, ఉఱిది, బిగువు-ఈ ౯ దృఢము.

తే. బద్దు నా బొంకు నాఁగ దబ్బఱ యనంగఁ
కల్ల నాఁగ హుళిక్కి నాఁ గ జెల్లుఁ బేళ్లు
ధర నసత్యమునకును సత్యంబు పరఁగు
నిజ మనఁగ నిక్కువం బన నిక్క మనఁగ. 58

టీ. బద్దు, బొంకు, దబ్బఱ, కల్ల, హుళిక్కి, ॥పా॥ హుళక్కి - ౫ అసత్యము. నిజము, నిక్కువము - ఈ 3 సత్యము.

క. బెడఁద దెస చేటు చేడ్పా
ట్గొడ వాత్రం బంగలార్పు గోరంబు దొసం
గిడుమ వెత కస్తి యంగద
కడగం డ్లనఁ జను విపత్తు గౌరీరమణా. 59

టీ. బెడఁద, దెస, చేటు, చేడ్పాటు, గొడవ, ఆత్రము, అంగలార్పు, గోరము, (ప్ర. ఘోరము,) దొసఁగు, ఇడుమ, వెత, కస్తి, అంగద, కడగండ్లు (నిత్య బహువచనాంతము) - ౧౫=విపత్తు.

క. వెల జట్టి విలువ రో యనఁ
గల నుడువులు దనరు చుండుఁ గ్రయనామము లై
వెలయంగ వంగసము నాఁ
గొల మన వంగడము నాఁగఁ గులమొప్పు శివా. 60

టీ. వెల, జట్టి, విలువ, రో (ప్ర. రై) - ౫=క్రయము. వంగసము (ప్ర. వంశము), కొలము (ప్ర. కులము), వంగడము - 3=కులము.

క. క్రమ్మఱ నెప్పటి వెండియుఁ
గ్రమ్మఱి తిరుగఁ మఱిఁ మఱలు మగుడను నా
నిమ్ముహిఁ బునఃపదంబున
కిమ్ములు నివి యాఖ్య లగు మహీధరచాపా. 61

టీ. క్రమ్మఱన్, నెప్పటి, వెండియున్, క్రమ్మఱి, తిరుగన్, మఱి, మఱలన్, మగుడన్ - ఈ ౮ పునః అను నర్థముగలవి.

క. ఒకమరి యొకపరి యొకమా
టొకసా రొక తేప యనఁగ § నొకపా రనఁగా
నొకవిడుత యొక్కతూ కన
నొకతడవ యనంగ మఱియు § నొకతూరి యనన్. 62

తే. ఏకవారం బనుట కొప్పు § నిన్ని పేళ్లు
జగతిఁ బల్మాఱు వేమాఱు § సారెఁ బెక్కు
మాఱు లెన్నేనిమా ర్లనఁ § బరఁగు నాఖ్య
లగుచు నివి బహువారంబు § లనుట కీశ. 63

టీ. ఒకమరి, ఒకపరి, ఒకమాటు, ఒకసారి, ఒకతేప, ఒకపారి, ఒకవిడుత, ఒక్కతూకు, ఒకతడవ, ఒకతూరి ॥పా॥ ఒకమాఱు - ౧౦=ఏకవారము. పల్మాఱు, వేమాఱు, సారె, పెక్కుమాఱులు, ఎన్నేనిమార్లు- ౫=బహువారములు (మాటిమాటికి).

తే. త్వరితమున కొప్పుఁ జెళ్లు చెచ్చెరను సరగ
వేగిరము వేగ వేళము § వెసను వడిగ
గ్రక్కునను గ్రద్దన ననంగఁ § గ్రన్న ననఁగ
గొబ్బునను దిగ్గున ననంగఁ § గుధ్రచాప. 64

టీ. చెచ్చెరను, సరగన్, వేగిరము, వేగ, వేళము ॥పా॥ వైళము, వెసను, వడిగను, గ్రక్కునను, గ్రద్దనను, క్రన్నను, గొబ్బునను, దిగ్గనను - ౧౨=త్వరితము.

క. కలవు వివరింపఁగా నా
ఖ్యలు వరుసన్ నిర్గమించె § ననుటకు ధరలో
వెలువడియె వెళ్లె వెడలెను

వెలలే ననం జితప్రకాశ ¦ విశ్వాధిపతీ. 65

టీ. వెలువడియెను, వెళ్లెను, వెడలెను, వెలలెను - ౪=నిర్గమించెను.

క. వినుతి యొనరించె ననుటకుఁ
దనరుఁ నామంబు లగుచు ¦ ధరపై నగ్గిం
చెను కైవారము సేసెం
గొనియాడెను బొగడె ననఁగఁ ¦ గొండాడె ననన్. 66

టీ. అగ్గించెను, కైవారముసేసెను, కొనియాడెను, పొగడెను, కొండాడెను-౫ = స్తుతించెను.

సీ. చుట్టలు విందులు ¦ చుట్టాలు బందుగు
లనఁ జను బంధుసమాహ్వయములు
పఱలు నన్యుఁడు లాఁతి ¦ వాఁడనఁగా వింత
వాఁడనఁగాఁ బెఱ ¦ వాఁడనంగ
వ్యాజంబునకు నామ ¦ మౌ నెపం బనఁగ న
న్వేషించె ననుట కౌ ¦ వెదకె నెమకె
నరసె రోసె ననంగ ¦ నారసెఁ దడవె నాఁ
గాంక్షకుఁ బేరు లౌఁ ¦ గ్రమముతోడఁ
తే. గ్రచ్చు కోరిక తమి కోర్కి ¦ యిచ్చ యనఁగ
నెపుడు నెడపక యుడుగక ¦ యెల్లపు డన
నిచ్చ యనయంబు నాఁగను ¦ నిచ్చ లనఁగఁ
దనరు నాఖ్యలు సంతతం ¦ బనుట కభవ. 67

టీ. చుట్టలు (రూ. చుట్టములు), విందులు, చుట్టాలు, బందుగులు (ప్ర. బంధువులు)- ౪ = బంధువులు. లాఁతివాఁడు, వింతవాఁడు, పెఱవాఁడు(ప్ర. పరుఁడు) -౩= అన్యుఁడు. నెపము(ప్ర. నిభము)-౧=వ్యాజము.

వెదకెను, నెమకెను, అరసెను, రోసెను, ఆరసెను, తడవెను - ౬=అన్వేషించెను. క్రచ్చు, కోరిక, తమి, కోర్కి, ఇచ్చ (ప్ర. ఇచ్ఛ) - ౫=ఇచ్ఛ. ఎప్పుడును, ఎడపక, ఉడుగక, ఎల్లప్పుడు, నిచ్చ, అనయమును, నిచ్చలు- ౭=సతతము.

సీ. తనరుఁ బ్రవేశించె ననుటకు నాఖ్యలు
తూఁకొనెఁ జొచ్చెను దూఱె ననఁగ
నంఘ్రితాడితుఁ జేసె ననుటకుఁ బేళ్లగుఁ
దాఁచెఁ గాళ్లం గ్రుమ్మెఁ దన్నె ననఁగ
నాలస్య మొనరించె ననుటకుఁ జెల్లు నా
మమ్ములు తడసెను మసలె ననఁగఁ
ద్యక్తంబు గావించె ననుటకు నాఖ్య లౌ
వీడెను వదలెను విడిచెఁ ననఁగఁ
తే. దాఱుమాఱయ్యె వీడ్వడెఁ దడఁబడె నన
నాఖ్య లొప్పు విపర్యస్త మయ్యె ననుట
కలరుఁ బ్రహరించె ననుట కాహ్వాయము లడిచెఁ
గొట్టె మొత్తెను మోఁదె నాఁ గుధరనిలయ. 68

టీ. తూఁకొనెను, చొచ్చెను, తూఱెను - ౩=ప్రవేశించెను. తాఁచెను, కాళ్లంగ్రుమ్మెను, తన్నెను- ౩= కాలితోఁ దన్నెను. తడసెను, మసలెను- ౨ ఆలస్యము చేసెను. వీడెను, వదలెను,విడిచెను- ౩= త్యజించెను. తాఱుమాఱయ్యెను, వీడ్వడెను, తడఁబడెను- ౩= విపర్యస్తమయ్యెను. అడిచెను, కొట్టెను, మొత్తెను, మోఁదెను - ౪ = ప్రహరించెను.

సీ. ముందట నెదుటను బ్రోల ముంగల నాఁగ
నాఖ్య లౌ సమ్ముఖ మనుట కభవ
యలయిక బడలిక యలపు సేద యనంగ
శ్రమమున కాఖ్య లౌ శమనదమన

తాలిమి యోరుపు § తాళిక నాఁగను
  క్షమకు నాహ్వయము లౌఁ § జర్మవసన
రవళి బవంతంబు § టక్కు దుత్తూరంబు
  వెడ్డు నా ఛద్మ మౌ § విషమనేత్ర
తే. వెఱ పనఁగ నెద యనఁగను § వెఱ యనంగ
నళుకనఁగ భీతి కాఖ్యలౌ § నసితకంఠ
నిమ్మళం బన నెమ్మి నా § నెమ్మది యనఁ
దనరుఁ బేళ్లు నిరాతంక§మునకు నీశ. 69

టీ. ముందటను, ఎదుటను, మొ్రలను, ముంగలను - ౪ = సమ్ముఖమందు. అలయిక, బడలిక, అలపు, సేద-౪=శ్రమము. తాలిమి, ఓరుపు, తాళిక-3=క్షమ. రవళి, బవంతము, టక్కు, దుత్తూరము, వెడ్డు-౫ కపటము. వెఱపు, ఎద, వెఱ, అళుకు- ౪=భయము. నిమ్మళము, నెమ్మి, నెమ్మది- 3= నిరాతంకము.

సీ. అసదు కొంచెము సైకె § మలఁతి యన్నువ చిన్న
  నలికంబు సన్నంబు § నాఁ దనర్చు
స్వల్ప మెక్కుడు నాఁగఁ § జాల నెంతేనియు
  మిగులఁ దద్దయుఁ దడ్డ § మిక్కిలి యనఁ
బెద్దయు ననునివి § పేళ్లగు భృశముగా
  ననుటకు నుత్కట § మయ్యె ననుట
కగుఁ బేళ్లు వెగ్గలం § బయ్యెఁ గ్రిక్కిఱిసె వె
  క్కసమయ్యె ననునివి § క్రమముతోడ
ఆ. సగ్గఁ గుందె డొంకెఁ § దగ్గను సడలెను
గ్రుంగె నుబ్బణంగె § గ్రుక్కెననఁగఁ

దనరుఁ బేళ్లు క్షీణదశ నొందె ననుటకు
నీశ్వరీసనాథ విశ్వనాథ. 70

టీ. అసదు, కొంచెము, పైకము, అలఁతి, అన్నువ, చిన్న, నలికము, సన్నము-౮=స్వల్పము. ఎక్కుడు, చాలఁ, ఎంతేనియును, మిగులను, తద్దయును, తద్ద, మిక్కిలి, పెద్దయును- ౮=అధికముగా. వెగ్గలంబయ్యెను, క్రిక్కిఱిసెను, వెక్కసమయ్యెను- ౩=ఉత్కటమయ్యెను. సగ్గెను, కుందెను, డొంకెను, తగ్గెను, సడలెను, క్రుంగెను, ఉబ్బణంగెను, క్రుక్కెను-౮=క్షీణదశఁ బొందెను.

ఆ. మించు వాసి మేలు మేటి పెచ్చె చ్చన
నధికమునకు నాఖ్య లగుచు వెలయుఁ
బనులు నాఁగఁ జెయువు లనఁ జేఁత లన నొప్పుఁ
గర్మమునకుఁ బేళ్లు చర్మవసన. 71

టీ. మించు, వాసి, మేలు, మేటి, పెచ్చు, ఎచ్చు-౬=అధికము. పనులు, చెయువులు, చేఁతలు-౩=కర్మము.

ఆ. అనిపె ననిచెఁ బనిపెఁ బనిచె నంపెను బంపెఁ
బుచ్చె గెలువు మనియెఁ బొమ్మటనియె
ననఁగ నివి సమాఖ్య లగును బ్రస్థాపించె
ననెడుక్రియకు నీశ యభ్రకేశ. 72

టీ. అనిపెను, అనిచెను, పనిపెను, పనిచెను, అంపెను, పంపెను, పుచ్చెను, గెలువుమనియెను, పొమ్మటనియెను-౯=పయనము చేయించెను.

తే. కొదవ కొద కుందు తగ్గు తక్కువ కొఱంత
వెలితి కొఱ లొచ్చు కడమ నాఁగ వెలయు న్న్యూన
సమభిధానము లర సాము సగము సవము
నాఁగ నర్ధాహ్వయంబు లౌ నాగభూష. 73

టీ. కొదవ, కొఱ, కుంచు, తగ్గు, తక్కువ, కొఱంత, వెలితి, కొఱ, లొచ్చు, కడమ-౧౦=న్యూనము. అర, సాము, సగము, సవము-౪=అర్ధము.

తే. పేళ్లు పశ్చాత్తనుటకును జెల్లు వెనుకఁ
బిదపఁ దర్వాతఁ బదపడి పిమ్మట నన
మునుపు మును మున్ను తొలి తొల్లి ముందు తొలుత
ననఁగఁ బూర్వపదార్థాఖ్య లౌ గిరీశ. 74

టీ. వెనుకను, పిదపను, తర్వాతను, పదపడి, పిమ్మటను - ౫ =అనంతరము. మునుపు, మును, మున్ను, తొలి, తొల్లి, ముందు, తొలుతను - ౭ = పూర్వము.

ఆ. పాఱుఁబోతు పిఱికి పంద కోఁచ యనంగఁ
బేళ్లు దనరు సమరభీరువునకు
దిట్ట యుక్కుతునియ గట్టిడెందంబువాఁ
డనఁగ ధైర్యవంతుఁ డలరు నీశ. 75

టీ. పాఱుఁబోతు, పిఱికి, పంద, కోఁచ - ౪ యుద్ధమున వెఱచెడి వాఁడు. దిట్ట, ఉక్కుతునియ, గట్టిడెందమువాఁడు-౩=ధైర్యవంతుఁడు.

తే. పౌఁజు చేరువ మొత్తంబు బారు తుటుము
దండు పరిగమి కూటువ పిండు దాఁటు
మూఁక దళమును పేళ్లు సమూహమునకు
భుజగవరహార యవిముక్తపురవిహార. 76

టీ. పౌఁజు, చేరువ, మొత్తంబు, బారు, తుటుము, దండు, పరిగమి, కూటువ, పిండు, దాఁటు, మూఁక, దళము-౧౩=సమూహము.

సీ. పూనె నూనెను దాల్చె నానెను మోచె నా
వహియించె ననుట లౌ నహివిభూష
నామము లుచ్చాటనము చేసె ననుటకు

వరుసతోఁ దఱిమెను బఱపె వెలిచెఁ
దోలెను ఒప్పె నా ద్రుహిణాదిసురనుత
త్రిప్పెను నాఁ గ్రమ్మఱించె ననఁగ
మగిడించె ననఁగను మరలించె నన సమా
హ్వయము లై పరఁగు నివర్తితంబు
తే. చేసె ననుటకు సురమునిసిద్ధసేవ్య
యడ్డగించెను నా నిల్పె ననఁగ నాఁగె
నన నివారించె ననుటకు నాఖ్య లమరు
నగసుతానాథ గుహగజాననసనాథ. 77

టీ. పూనెను, ఊనెను, తాల్చెను, ఆనెను, మోచెను-౫=వహించెను. తఱిమెను, పఱపెను, వెలిచెను, తోలెను, ఒప్పెను - ౫ = ఉచ్చాటనము చేసెను. త్రిప్పెను, క్రమ్మఱించెను, మగిడించెను, మరలించెను-౪ = నివర్తితంబుచేసెను. అడ్డగించెను, నిల్పెను, ఆఁగెను-౩=నివారించెను.

తే. దండ చేరువ సంగడి దాపు చెంత
సరస చెంగట యొద్ద దగ్గఱ కుఱంగ
టండ పజ్జయు నా సమీపాఖ్య లమరు
రమ్యధవళాంగ కలశనీరధినిషంగ. 78

టీ. దండ, చేరువ, సంగడి, దాపు, చెంత, సరస, చెంగట, ఒద్ద, దగ్గఱ, కుఱంగటి, అండ, పజ్జ (ప్ర. పశ్చాత్)-౧౨=సమీపము.

తే. అచట నచ్చట నచ్చోట నందు నాడ
నచోట నచ్చోట నక్కడ నయ్యెడ నట
ననఁగఁ దత్ప్రదేశంబునం దనుట కాఖ్య
లయ్యె భక్తవిధేయ యార్యాసహాయ. 79

టీ. అచట, అచ్చట, అచ్చోట, అందు, ఆడ, అచోట, అచ్చోట, అక్కడ, అయ్యెడ, అట-౧౦=ఆప్రదేశంబునందు.

క. ఇరుగెలఁకుల నిరువంకల
నిరుదెస నిరుచక్కియందు నిరుపక్కియలం
దిరుగ్రేవల నిరుగడ ననఁ
బొరిఁ బేళ్లగు నుభయపార్శ్వములఁ ననుట కజా. 80

టీ. ఇరుగెలఁకులన్, ఇరువంకలన్, ఇరుదెసన్, ఇరుచక్కియందు, ఇరుపక్కియందు, ఇరుగ్రేవలన్, ఇరుగడన్-౭=ఉభయ పార్శ్వములందు.

క. నవముగ ధరలో నీమా
నవవర్గను వేడ్కఁ జదివినను వ్రాసిన మా
నవులకు ననవరతంబును
శివుఁ డవిముక్తేశ్వరుండు చెలువం బొసఁగున్. 81

---

## స్థావరవర్గు.

సీ. వలిదిప్ప వడఁకుగుబ్బలి చలిమిరిమల
గట్టులఱేఁడు ముక్కంటిమామ
మంచుకొం డన హిమత్తుహినధరాఖ్యలు చను
వేలుపుఁగొండ జేజేలగట్టు
పుత్తడిగుబ్బలి పునుకకంచమువాని
విల్లు నా మేరువుపేళ్లు వెలయు
వెలిదిప్ప ముక్కంటిమల వెండికొండ నాఁ
గైలాసపర్వతాఖ్యలు సెలంగు

తే. వెలయుఁ దరికొండ కవ్వంపుమల యనంగ
మందరాఖ్యలు కడపటిమలయనంగఁ

జుట్టుఁగొండ ననఁ దనరు నీక్షోణియందుఁ
జక్రవాళాద్రి వృషవాహ ! శైలగేహ. 1

టీ. వలిదిప్ప=చల్లఁదనముగలకొండ, పడఁకుగుబ్బలి॥పా॥వణఁకుగుబ్బలి=చలిచే వడఁకున ట్లు చేయుకొండ, చలిమిరిమల, గట్టులఱేఁడు=పర్వతములకురాజు, ముక్కంటిమామ=శివునకుమామ, మంచుకొండ=హిమము గల పర్వతము-2=హిమవత్పర్వతము. వేలుపుఁగొండ, జేజేలగట్టు(ఈ రెండుశబ్దములకును దేవతలపర్వత మని యర్థము), పుత్తడిగుబ్బలి=సువర్ణపర్వతము, పునుకకంచమువానివిల్లు=ఈశ్వరునిధనుస్సు-ఈ8 మేరుపర్వతముపేళ్లు. వెలిదిప్ప=తెల్లనిపర్వతము, ముక్కంటిమల = శివునిపర్వతము, వెండికొండ = రజతపర్వతము-3=కైలాసపర్వతము. తరిగొండ, కవ్వంపుమల, (ఈ రెండుశబ్దములకుఁ గవ్వమైనపర్వతమని యర్థము)-2=మందరపర్వతము. కడపటిమల = కడగానుండెడుపర్వతము, చుట్టుఁగొండ = భూమిచుట్టునుండెడు పర్వతము-2=చక్రవాళపర్వతము.

ఆ. తూర్పుఁగొండ నాఁగఁ ! దొలుగట్టు నాఁగను
బొడుపుగుబ్బ లనఁగఁ ! బూర్వశిఖరి
పరఁగుఁ గ్రుంకుమెట్టు ! పడమటికొండ నా
వెలయు నస్తశిఖరి ! విశ్వనాథ. 2

టీ. తూర్పుఁగొండ, తొలుగట్టు=పూర్వదిక్కునందుండెడుపర్వతము. పొడుపుగుబ్బలి=సూర్యుఁ డుదయించెడు పర్వతము- 3=ఉదయపర్వతము, గ్రుంకుమెట్టు=సూర్యుఁ డస్తమించుపర్వతము, పడమటికొండ-2=అస్తగిరి.

తే. ఒప్పు గిరిపేళ్లు మల గట్టు ! తిప్ప మెట్టు
కొండ గుబ్బలి నా మేరు!కుధరచాప
తాయి నాఁగ ల్లనంగను ! తా యనంగ
శిల కభిఖ్యలు దగు నిల ! శేషభూష. 3

టీ. మల, గట్టు, తిప్ప, మెట్టు, కొండ, గుబ్బలి - ౬ = పర్వతము. తాయి ॥రూ॥ రాయి, కల్లు, తా - 3 = శిల.

తే. పల్లె కొట్టిక కొటిక కుప్పమ్ము నాఁగ
నూరనఁగ గ్రామనామంబు లొప్పుచుండుఁ
బట్టణంబున కాఖ్యలు పరఁగుచుండుఁ
బ్రోలనఁగ వీడనంగను శూలపాణి. 4

టీ. పల్లె ॥పా॥ పల్లియ, కొట్టిక, కొటిక, కుప్పము, ఊరు - ౫ = గ్రామము. ప్రోలు, వీడు - ౨ = పట్టణము.

తే. ఉనికిపట్టు తావు మనికిప ట్టిర విల్లు
తెంకి యిక్క నట్టు టెంకి యిమ్ము
నెలవు గీము నాఁగ నలరు నివాసదే
శంబునకును బేళ్లు చంద్రమౌళి. 5

టీ. ఉనికిపట్టు, తావు, మనికిపట్టు, ఇరవు, ఇల్లు, తెంకి, ఇక్క, నట్టు, టెంకి, ఇమ్ము, నెలవు, గీము - ౧౨ = నివాసస్థానము.

సీ. తెంకాయచెట్టన టెంకాయమ్రానన
నారికేళం బొప్పు నగనివేశ
మావిమ్రాననఁగను మామిడిచెట్టన
నామ్రభూజం బొప్పు నభ్రకేశ
యత్తిమ్రానన మేడి యనఁగ నౌదుంబర
ధారుణీజం బొప్పు మేరుచాప
యరఁటి యనంటి నా నంశుమత్ఫలధారు
ణీరుహం బగు ధరణీశతాంగ
తే. యలరుఁ దుంబీశలాటుసమాఖ్య లాను
గంబు సొఱకాయ యదరు నా గరళకంఠ

తా డనంగను దాడి నాఁ ౕ దాళభూరు
హంబునకు నాఖ్యలై యొప్పు ౕ నంబికేశ. 6

టీ. తెంకాయచెట్టు, టెంకాయమ్రాను - ౨ = నారికేళవృక్షము. మావిమ్రాను, మామిడిచెట్టు - ౨ = ఆమ్రవృక్షము. అత్తిమ్రాను, మేడి, ౨=ఉదుంబరవృక్షము. అరఁటి, అనఁటి - ౨=కదళీవృక్షము. అనుఁగము-సొంటకాయ, వదరు - 3 = సొంటచెట్టు. తాడు, తాడి-౨=తాళవృక్షము.

సీ. మొక్క మోక నిసువు ౕ మొలక మోసనఁగ నం
కురమునకును బేళ్లు ౕ కుధరచాప
యిగు రనఁ దలిరు నాఁ ౕ జిగురు నాఁ జివు రనఁ
బల్లవనామముల్ ౕ పరఁగు నీశ
మ్రా ననఁ జెట్టన ౕ మ్రాఁకన భూరుహ
నామధేయము లగు ౕ వామదేవ
పువు పువ్వు పూ నాఁగఁ ౕ బుష్పము విరి యల
రనఁ గుసుమాఖ్యలై ౕ యలరు నీశ
తే. గుబురు దట్టంబు జొంపంబు ౕ గుంపు తఱుచు
నాఁగ నిబిడంబుపే ళ్లొప్పు ౕ నందివాహ
వల్లరిసమాఖ్య లగుచు వర్తిల్లుఁ దీఁగ
తీవ తీవియ తీవె నాఁ ౕ ద్రిపురవైరి. 7

టీ. మొక్క, మోక, నిసువు, మొలక, మోసు - ౫ = అంకురము. ఇగురు, తలిరు, చిగురు, చివురు - ౪ = పల్లవము. మ్రాను ॥పా॥ మాను, చెట్టు, మ్రాఁకు - ౪=వృక్షము. పువు,పువ్వు,పూ, పుష్పము (ప్ర.పుష్పము), విరి, అలరు - ౬ = కుసుమము. గుబురు, దట్టము, జొంపము, గుంపు, తఱుచు - ౫ = నిబిడము. తీఁగ, తీవ, తీవియ, తీవె ॥రూ॥ తీఁగె - ౫ = లత.

ఆ. అగ్రమున కభిఖ్య లగుచుండుఁ దుద సుద
కొన యనంగ వృక్షకోటరమున
కలరుఁ బేళ్లు తొఱట తొలి తొఱ్ఱి తొఱ నాఁగ
నాగహార రజతనగవిహార. 8

టీ. తుద, సుద, కొన - ౩ = అగ్రము. తొఱట, తొలి, తొఱ్ఱి, తొఱ - ౪ = వృక్షకోటరము.

ఆ. ఇక్షువునకభిఖ్య లీక్షింతిఁ గన్నుల
ప్రాను చెఱకు తియ్యప్రాను ననఁగఁ
దనరు దవ యనంగఁ దలవాడె నాఁగఁ ద
దగ్రమున కభిఖ్య లగు గిరీశ.

టీ. కన్నులప్రాను = పర్వములుగలశాఖ, చెఱకు, తియ్యప్రాను = మధురమైన వృక్షము - ౩ = ఇక్షువు. దవ, తలవాడె - ౨ = చెఱకుకొన.

క. అగుఁ బేళ్లుత్పలమునకుం
దొగ తొవ కల్వ కలు వనఁగఁ దోయజ మొప్పం
దగఁ దమ్మి తామ రనఁగా
మొగడన మొగ్గ యనఁ దనరు ముకుళంబు శివా. 10

టీ. తొగ, తొవ, కల్వ, కలువ-౪ = ఉత్పలము. తమ్మి, తామర - ౨ = కమలము. మొగడ, మొగ్గ - ౨ = ముకుళము.

తే. ఎసఁగుఁ జెందొవ చెందొగ యెఱ్ఱగలువ
యనఁగ రక్తోత్పలంబు రక్తాబ్జ మొప్పు
నిలను గెందమ్మి కెందామ యెఱ్ఱదామ
రనఁగఁ జెందమ్మి చెందామ రన మహేశ. 11

టీ. చెందొవ, చెందొగ, ఎఱ్ఱగలువ - ౩ = రక్తోత్పలము. కెందమ్మి

(కెంపు+తమ్మి), కెందామర (కెంపు+తామర), ఎఱ్ఱదామర, చెందమ్మి, చెందామర - ౫ = రక్తాబ్జము.

క. గొడుగు గొడు గెల్లి యనం జె
న్నడరును ఛత్రంబు కేతనాహ్వాయము లగుఁ
సిడె మనంగఁ డెక్కె మనంగాఁ
బడగ యనన్ డా లనంగఁ బర్వతధన్వా. 12

టీ. గొడువు, గొడుగు, ఎల్లి - ౩ = ఛత్రము. సిడెము, టెక్కెము, పడగ (ప్ర. పతాక), డాలు - ౪ = కేతనము.

క. మఱుఁ గనఁగ నోల మనఁగా
మఱు వనఁగాఁ జా టనంగ మా టన వరుసం
బరఁగు ని వెల్ల నగోచర
ధరణీనామంబు లగుచు దర్పకదమనా. 13

టీ. మఱుఁగు, ఓలము, మఱువు, చాటు, మాటు - ౫ = కన్నులకగపడనిప్రదేశము.

క. పొసఁగుఁ దృణాఖ్యలు పులు నాఁ
గస వనఁగాఁ బూరి యనఁగ గడ్డి యనంగా
వసుమతిలో నెన్నంబడు
ససి సస్సెము పై రనంగ సస్యం బభవా. 14

టీ. పులు, కసవు (ఘాసము), పూరి, గడ్డి - ౪ = తృణము. ససి, సస్సెము (ప్ర. సస్యము), పైరు - ౩ = సస్యము.

ఆ. తెలుపు తెల్ల వెల్ల తెలి వెలి నాఁగ నా
హ్వాయము లమరు ధవళవర్ణమునకుఁ
గప్పు నలుపు నల్ల కఱ యన నాఖ్య లౌ
నీలవర్ణమునకు నీలకంఠ. 15

టీ. తెలుపు, తెల్ల, వెల్ల, తెలి, వెలి - ౫ = ధవళవర్ణము. కప్పు, నలుపు, నల్ల, కఱ ॥పా॥ కఱి - ౪ = నీలవర్ణము.

ఆ. కెంపు తొగరు తొవరు కెంజాయ యెఱుపు వెఱ్ఱి
యనఁగ నరుణకాంతి కాఖ్య లయ్యె
నళది పసుపుచాయ యనఁగ హారిద్రవ
ర్ణమున కాఖ్య లగుఁ బినాకహస్త. 16

టీ. కెంపు, తొగరు, తొవరు, కెంజాయ, (కెంపు+చాయ), ఎఱుపు, ఎఱ్ఱి - ౬ = అరుణకాంతి. అళది (రూ. హళిది), పసుపుచాయ - ౨ = హారిద్రవర్ణము.

ఆ. శ్యామవర్ణమునకు నామంబు లగు చుండుఁ
బసరుచాయ యనఁగఁ బచ్చ యనఁగ
వన్నె డాలు రంగు వన్నియ జిగి జోతి
చాయ యనఁగఁ బరఁగు జగతిఁ గాంతి. 17

టీ. పసరుచాయ, పచ్చ - ౨ = శ్యామవర్ణము. వన్నె, డాలు, రంగు, వన్నియ (ప్ర. వర్ణము), జిగి, జోతి (జ్యోతిస్సు), చాయ (ప్ర. ఛాయ)-౭=కాంతి.

తే. మానికము లన రతనముల్ నా నెసంగు
నవని మాణిక్యములకు సమాహ్వయములు
మెఱుఁగ నంగను నిగ్గు నా మెఱయుచుండు
నాఖ్య లుత్కృష్టకాంతికి నభ్రకేశ. 18

టీ. మానికములు. (ప్ర. మాణిక్యములు), రతనములు(ప్ర.రత్నములు) ౨ = మాణిక్యములు. మెఱుఁగు, నిగ్గు-౨=ఎక్కువైనకాంతి.

తే. జలధిపే ళ్లగు మున్నీరు కడలి సంద్ర
మనఁగ నుదుఁ గన మడువు నా హ్రాదము దనరుఁ

బరఁగు నాఱవసంద్రంబు శ్రీ పాలవెల్లి
జిడ్డుకడలి పాల్కడలి నా శ్రీ క్షీరజలధి. 19

టీ. మున్నీరు, కడలి, సంద్రము (ప్ర.సముద్రము)-3 = సముద్రము. మడుఁగు, మడువు - 2 = హ్రదము. ఆఱవసంద్రము, పాలవెల్లి, జిడ్డుకడలి, పాల్కడలి - 4 క్షీరసముద్రము.

క. నంజె యన మడి యనంగను
మంజులకేదారభూసమాఖ్యలు వెలయుం
బుంజె యనఁ జేను పొల మనఁ
గం జను మరుభూమిపేళ్లు శ్రీ కాయజదమనా. 20

టీ. నంజె, మడి-2=కేదారభూమి. పుంజె, చేను, పొలము - 3 = మెట్టభూమి.

క. ధరణీశ వివరాఖ్య లగుఁ
బొటియ కలుఁగు లాఁగ బొక్క శ్రీ బొంద యనంగా
దరి యొడ్డు గట్టనంగాఁ
బఱగుం దీరంబుపేళ్లు శ్రీ ప్రమథగణేశా. 21

టీ. బొటియ, కలుఁగు, లాఁగ, బొక్క, బొంద-5=బొంద. దరి, ఒడ్డు, గట్టు-3=తీరము.

తే. అస లనంగను ఓంపి నా శ్రీ నడు సనంగ
బురద నా నొప్పుఁ గర్దమంబునకుఁ బేళ్లు
భూమికి సమాఖ్య లగు బువి శ్రీ పుడమి నేల
మన్ను పంటవలంతి నా శ్రీ మదనదమన. 22

టీ. అసలు, ఓంపి, అడుసు, బురద-4=అడుసు. బువి (ప్ర. భువి), పుడమి, నేల, మన్ను, పంటవలంతి=పంటలకు, స్థానము-5=భూమి.

తే. జగిలె యనఁగ నరుఁగు నాఁగ జగతి నాఁగఁ
దిన్నె యన వేదికాఖ్య లై యెన్నఁ దనరు
మిఱ్ఱనంగను మెఱక నా మిట్ట యనఁగ
నున్నతక్షితి కాఖ్యలై యొప్పు నభవ. 23

టీ. జగిలె॥ పా॥ జగ్గిలె, అరుఁగు, జగతి, తిన్నె-౪=వేదిక. మిఱ్ఱు, మెరక, మిట్ట-౩=ఉన్నతప్రదేశము.

తే. తనరు నిశ్రేణి తాప నిచ్చెన యనంగఁ
దెప్ప తేప యనునాఖ్యల నొప్పుఁ బ్లవము
పరఁగు నోడ నఁ గల మనఁ దరణి ధరణిఁ
దరణిశీతాంశుశిఖినేత్ర ధవళగాత్ర. 24

టీ. తాప, నిచ్చెన-౨=నిశ్రేణి. తెప్ప, తేప-౨=ప్లవము. ఓడ, కలము-౨=తరణి, అనఁగా నావ.

తే. కార్ముకం బొప్పు విల్లు సింగాణి యనఁగఁ
దూణ మొప్పు బత్తళిక నా దొన యనంగఁ
దరకసం బనఁ బొది యనఁ దనరు శరము
కోల ములి కమ్ము తూపు నా శూలపాణి. 25

టీ. విల్లు, సింగాణి-౨=ధనుస్సు. బత్తళిక, దొన, తరకసము, పొది-౪=అమ్ములపొది. కోల, ములికి, అమ్ము, తూపు-౪=శరము.

తే. తనరుఁ బేర్లు తనుత్రాణమునకుఁ గత్త
ళంబు జోడు జిరా దుప్పటంబు బొంద
ళం బనఁగ నాఖ్యలగు శతాంగంబునకును
దేరు నా నరదము నాఁగ మేరుచాప. 26

టీ. కత్తళము, జోడు, జిరా, దుప్పటము, బొందళము-౫=కవచము. తేరు, అరదము (ప్ర. రథము)-౨=రథము.

క. కన్నా కన్నను దలక
ట్టన్నను మఱి మేలుబంతి యన్నను ధరలో
నిన్నియు శ్రేష్ఠము పేళ్లై
యెన్నంబడు రాజసభల నిభదైత్యహరా. 27

టీ. కన్నాకు, తలకట్టు, మేలుబంతి-౩=శ్రేష్ఠము.

క. సొమ్మనఁ దొడవనఁగా రవ
ణ మ్మన నగుఁ బేళ్లు భూషణమ్ములకును హా
రమ్ములకును నగు నభిధా
నమ్ములు పేరు లన సరులు నా శితికంఠా. 28

టీ. సొమ్ము, తొడవు, రవణము-౩=భూషణములు. పేరులు, సరులు-౨=హారములు.

తే. సరము లెత్తులు దండలు సరు లనంగ
నామధేయంబు లగుఁ బుష్పదామములకు
వాసనకు నాఖ్యలై యొప్పు వలపు కంపు
తావి కమ్మన యనఁగఁ గాత్యాయనీశ. 29

టీ. సరములు, ఎత్తులు, దండలు, సరులు-౪=పుష్పదామములు-వలపు, కంపు, తావి, కమ్మన-౪=వాసన.

క. ఒడమె యన సొమ్మనంగా
విడిముడి యన రొక్క మనఁగ విత్తంబునకుం
బుడమిని నామము లగు నివి
యుడురాజకళావతంస యురగాభరణా. 30

టీ. ఒడమె, సొమ్ము, విడిముడి, రొక్కము (ప్ర. రుక్మము)-౪ = విత్తము-అనఁగా ధనము.

తే. మచ్చు లన మిద్దె లనఁగను । మాడుగు లన
దారునిర్మితగేహముల్ । దనరు చుండుఁ
బరఁగు సౌధంబు మేడ యు।ప్పరిగ యనఁగ
నాగకేయూర మానిమా।నసవిహార. 31

టీ. మచ్చులు, మిద్దెలు, మాడుగులు ॥పా॥ మాడువులు-౩= దారునిర్మితగృహములు. ఉప్పరిగ (ప్ర. ఉపకారిక), మేడ-౨=సౌధము.

తే. పెట్టె యన మందసం బనఁ । బెట్టె యనఁగఁ
బెట్టియ యనంగఁ బేటికా।భిఖ్య లమరు
మోఁ్రి డనంగను మోటు నా । మొద్దనంగ
వెలయు స్థాణుసమాఖ్యలు । విశ్వనాథ. 32

టీ. పెట్టె (ప్ర. పేటి), మందసము (ప్ర. మంజూషు), పెట్టె- పెట్టియ - ౪ = పేటిక. మోఁ్రిడు, మోటు, మొద్దు-౩=స్థాణువు.

ఆ. విస్తృతాఖ్య లొప్పు । విప్పు తనర్పు నా
వెడఁద విరివి పఱపు । వెడలు పనఁగ
దీర్ఘమునకు నామ।ధేయంబు లై యొప్పు
నిడుద చాఁపు నిడివి । నిడు పనంగ. 33

టీ. విప్పు, తనర్పు, వెడఁద, విరివి, పఱపు, వెడలుపు-౬ = విస్తృతము. నిడుద, చాఁపు, నిడివి, నిడుపు-౪=దీర్ఘము.

ఆ. ఈడు దినుసు సాటి । యెన దొర సరి జోడు
సవతు మాఁద్రి యుద్ది । జత తరంబు
పురుడు నాఁగ సదృశ।మున కివి యాఖ్యలౌ
వివిధగుణసనాథ । విశ్వనాథ. 34

టీ. ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు, సవతు, మాఁద్రి, ఉద్ది, జత, తరము, పురుడు-౧౩=సమానము.

తే. పసిఁడి బంగరు బంగారు ♦ పైఁడి పొన్ను
జాళువా పుత్తడి యనంగ ♦ స్వర్ణ మమరుఁ
దప్తకాంచన మమరుఁ గుందన మనం గ
డాని యపరంజి నా గజదానవారి. 35

టీ. పసిఁడి, బంగరు, బంగారు, పైఁడి, పొన్ను ॥రూ॥ హొన్ను, జాళువా, పుత్తడి-౭=స్వర్ణము. కుందనము, కడాని, అపరంజి-3 =పుటము దీరిన బంగారము.

ఆ. చిదుర తునుక తునియ ♦ చిదురుప వ్రక్క పా
లనఁగ ఖండమునకు ♦ నాఖ్య లమరుఁ
బోగు కుప్ప వామి ♦ ప్రోవు తిట్ట యనంగ
రాశి కాఖ్య లగు ధరారాశతాంగ. 36

టీ. చిదుర, తునుక, తునియ, చిదురుప, వ్రక్క, పాలు-౬ = ఖండము. పోగు, కుప్ప, వామి, ప్రోవు, తిట్ట-౫=రాశి.

క. ఈస్థావర వర్గం గడు
నాస్థ వినఁ జదువ వ్రాయ ♦ నవనీస్థలిలో
నాస్థానునికృప నఖిలశు
భస్థితులును జనుల కొదవు ♦ భాసురలీలన్. 37

---

తిర్యగ్వర్గు.

సీ. వెడఁదపోముమెకంబు ♦ జడలమెకం బేనుఁ
గులగొంగ మెకములకొలముసామి
తెల్లడాలుమెకంబు ♦ తెఅనోటిమెకము సిం
గంబు నా బొబ్బమెకం బనంగఁ

బరఁగును మృగరాజు ♦ పసిదిండి పులి మెకం
బులతిండిపోతు చాఱలమెకంబు
మువ్వన్నె మెక మన ♦ నివ్వసుంధరయందు
వ్యాఘ్రమంబునకు సమాఖ్యలు చెలంగుఁ
ఆ. బుట్టకూడుదిండిపో తన వెనుకచూ
పులమెకంబు నాఁగ ♦ నెలు వనంగ
నెలుఁగు నాఁగ మోరతెలుపుమెకంబు నా
భల్లుకంబు దనరు ♦ ఫాలనేత్ర. 1

టీ. వెడఁదమోముమెకము = విశాలముఖముగల మృగము, జడల మెకము=జడలు గలమృగము, ఏనుఁగులగొంగ=గజములకు శత్రువు, మెక ములకొలముసామి=మృగకులాధిపతి, తెల్లడాలు మెకము=ధవళకాంతిగలది, తెఱనోటి మెకము = తెఱచియుండెడు నోరుకలది, సింగము, (ప్ర - సింహము), బొబ్బమెకము=బొబ్బలువేసెడు మృగము - ౦ = సింహము. పసి దిండి=పశువులను భక్షించునది, పులి, మెకంబులతిండిపోతు = మృగములను భక్షించునది, చాఱలమెకము = చాఱలుగలమృగము, మువ్వన్నె మెకము= మూఁడువన్నెలుగల మృగము-౫=వ్యాఘ్రము. పుట్టకూడుదిండిపోతు=పుట్ట కూడుతినునది, వెనుకచూపులమెకము=పశ్చాద్దృష్టిగలది, ఎలువు, ఎలుఁగు, మోరతెలుపుమెకము=ముఖమందు తెలుపుగలమృగము - ౫=భల్లుకము.

క. పలుగొమ్ములమెకి మనఁగా
నిల నెక్కుడుమెక మనంగ ♦ నేనుఁ గనంగా
బలువంజమెకము నాఁ జే
గల మెక మన గొ రనంగఁ ♦ గరి యొప్పు శివా. 2

టీ. పలుగొమ్ములమెకము = దంతములే కొమ్ములుగాఁగలమృగము, ఎ క్కుడుమెకము=అధిష్ఠింప యోగ్యమైనమృగము, ఏనుఁగు, బలువంజమెకము,

(బలువు+అంజ+మెకము) ॥పా॥ బలుపాజ్జమెకము=బలువైనపాదములుగల మృగము, చేగలమెకము =హస్తము (అనఁగా తొండము) గల మృగము-కరి, గారు-౬=గజము.

తే. వాజికి సమాఖ్య లగుఁ దేజి ♦ వారువంబు
మావు గుఱ్ఱంబు తట్టువ ♦ వావురంబు
కత్తలాని బాబా జక్కి ♦ తత్తడి యన
విగతభవపాశ కాశీనివేశ యీశ. 3

టీ. తేజి, వారువము, మావు, గుఱ్ఱము, తట్టువ, వావురము, కత్తలాని, బాబా, జక్కి, తత్తడి-౧౦=అశ్వము.

క. తగ రేడిక పొట్టే లన
నగు మేషసమాఖ్య లెనిమిదడుగులమెక మే
నుఁగుఁగొంగసూ డనంగా
జగతిన్ శరభాఖ్య లొప్పుఁ ♦ జంద్రార్ధధరా.

టీ.తగరు, ఏడిక, పొట్టేలు,-3=మేషము. ఎనిమిదడుగుల మెకము=అష్టపాదములుగల మృగము, ఏనుఁగుగొంగసూడు= సింహమునకు విరోధి-౨=శరభమృగము.

క. సంగతి నుష్ట్రాఖ్యలు నొ
వ్వెం గదు నొంటె లన లొట్టిపిట్ట లనన్ సా
రంగాఖ్య లలరు నిఱ్ఱు ల
నంగా జింక లన లేళ్లు ♦ నా సర్వజ్ఞా. 5

టీ. ఒంటెలు, లొట్టిపిట్టలు-౨=ఉష్ట్రము. ఇఱ్ఱులు, జింకలు, లేళ్లు-3=సారంగములు.

క. నులిగొమ్ములమెక మిఱ్ఱన
నిల మృగమున కొప్పుఁ జేళ్లు ♦ మృగి లేడి యనన్

వెలయును రెంటికిఁ దగు నా
ఖ్యలు జింక యనంగ నీశ ॥ యంబరకేశా. 6

టీ. నులిగొమ్ములమెకము=మెలిగా నుండెడుకొమ్ములు గలమృగము, ఇట్టి - ౨=మగజింక. లేడి=ఆఁడుజింక. జింక - అనునది యీరెంటికిని పేరు.

తే. పసులు తొడుకులు పసరముల్ ॥ పసి యనంగఁ
బశువులకును సమాఖ్యలై ॥ పరఁగు నాల
పోతు బసవఁడు గిబ్బ యాఁబోతనంగ
వృషభమున కాఖ్య లై యొప్పు ॥ వృషభవాహ. 7

టీ. పసులు, తొడుకులు, పసరములు ॥పా॥ పసలములు, పసి- ౪= పశువులు. ఆలపోతు = పశువులకుఁ బతి, బసవఁడు, గిబ్బ, ఆఁబోతు-౪= వృషభము.

సీ. తొట్టిపట్టు లనంగ ॥ దొడ్లనఁగా నివి
గోష్ఠదేశమునకుఁ ॥ గొటిలు నీశ
కదుపులు మొదవులు ॥ పదువులు మందలు
నా ధేనుగణ మొప్పు ॥ నగనివేశ
యలరు నాఖ్యలు లేఁగ ॥ లన దూడ లనఁ గ్రేపు
లన వత్సములకును ॥ ధనదమిత్ర
యా వనఁగా గిడ్డి ॥ యనఁ దొడు కన మొద
వన ధేనునామముల్ ॥ దనరు నభవ

తే. యుతమునకు సమాఖ్య లై ॥ యొప్పుచుండు
గిత్త పెద్దనఁ గోడె నాఁ ॥ గృత్తివాస
యాలనఁగ ధేనువుల కాఖ్య ॥ యలరుచుండు
శైలజానాథ ప్రమథసం ॥ చయసనాథ. 8

టీ. తొట్టిపట్టులు, చొప్పు - ౨ = గోవులుండెడు స్థానము. కదుపులు, మొదవులు, పదువులు, మందలు-౪ = ధేనుసమూహము. లేఁగలు, దూడలు, క్రేపులు - 3=వత్సరములు. ఆవు, గిడ్డి, తొడుకు, మొదవు - ౪=గోవు. గిత్త, యెద్దు, కోడె - 3= ఉక్షము. ఆలు= ధేనువులు.

తే. అలరుఁ గుందేలు చెవులపో తనఁగ శశక
మొప్పఁ బొడలమెకంబు నా దుప్పి యనఁగఁ
గాఱుకొమ్ములమెక మనంగను ధరిత్రి
రామనామమృగంబు ధరాశతాంగ. 9

టీ. కుందేలు, చెవులపోతు - ౨=శశము. పొడలమెకము=మచ్చలుగలది, దుప్పి, కాఱుకొమ్ములమెకము=సాంద్రశృంగములు గలమృగము-3=రామనామమృగము.

తే. దుంత యెనుపోతు జమునెక్కిరింత దున్న
యనఁగ మహిషంబునకు సమాహ్వయము లమరుఁ
బరఁగు నెనుపెంట్లు గేదెలు బఱ్ఱె లెనుము
లనఁగ మహిషీసమాఖ్యలు ధనదమిత్ర. 10

టీ. దుంత, ఎనుపోతు, జమునెక్కిరింత=యమునివాహనము, దున్న ౪= మహిషము. ఎనుపెంట్లు, (ఎనుము+పెంట్లు), గేదెలు, బఱ్ఱెలు- ఎనుములు-౪= మహిషి.

తే. పక్కి పులుఁగు పిట్ట యనంగఁ బక్షి యొప్పు
గఱులు ఱెక్కలు చట్టుప లెఱక లనఁగఁ
బక్షముల కివి పేళ్లగుఁ బర్ణములకు
నాఖ్య లగు లావు లన నీఁక లనఁగ నీశ. 11

టీ. పక్కి (ప్ర. పక్షి), పులుఁగు, పిట్ట.3= పక్షి. గఱులు, ఱెక్కలు, చట్టుపలు, ఎఱకలు-౪=పక్షములు. లావులు, ఈఁకలు-౨=పర్ణములు.

సీ. తొలకరి కలుగుపుల్గులు నల్వతేజీలు
పాలు నీరును నేరుపఱుచుపులుఁగు
లంచలు తెలిపిట్ట లన నొప్పు హంసలు
క్రౌంచముల్ దనరారుఁ గొంచ లనఁగఁ
గొక్కెరా లనఁగను గొక్కు లనంగను
గొక్కెర లనఁగను గొంగ లనఁగఁ
బరఁగు నభిఖ్యలు బకవిహంగములకు
నట్టువపులుఁగు నాఁ జుట్టుపులుఁగు
తే. నాఁగ నెమ్మన నెమిలి నా నమ్మి యనఁగఁ
గేకికి సమాఖ్య లగుఁ జంచరీకములకు
నాఖ్యలు జమిలిముక్కాలి యనఁగఁ దేఁటి
యనఁగఁ దుమ్మెద నా నీశ యభ్రకేశ. 12

టీ. తొలకరికలుగుపుల్గులు = వర్షాకాలమునఁ బరాఙ్ముఖములయ్యెడుపక్షులు, నల్వతేజీలు=బ్రహ్మకు వాహనములు, పాలునీరును నేరుపఱుచుపులుఁగులు=క్షీరోదకములను వేఱుపఱుచునట్టిపక్షులు, అంచలు (ప్ర. హంసలు), తెలిపిట్టలు=తెల్లనిపక్షులు- ౫ = హంసలు. క్రౌంచలు (ప- క్రౌంచములు)-౧=క్రౌంచపక్షులు. కొక్కెరాలు, కొక్కులు, కొక్కెరలు, కొంగలు-౪=బకములు. నట్టువపులుఁగు=నాట్యమును జేయుపక్షి, జుట్టుపులుఁగు=సిగగలపక్షి, నెమ్మి, నెమిలి, నమ్మి - ౫=కేకి. జమిలిముక్కాలి=ఆఱుపాదములు గలది (=షట్పదము), తేఁటి, తుమ్మెద - ౩=భ్రమరము.

తే. పరఁగు నొడ్డీలు కూకీలు పల్లటీలు
పావురాలును బకదార్లు పావురములు
నాఁగఁ గలరవపక్షిబృందముల పేళ్లు
పంకజాతాక్షసన్మిత్ర ఫాలనేత్ర. 13

టీ. ఒడ్డీలు, కూకీలు, పల్లటీలు, పావురాలు, [ప్ర. పారావతములు] బకదార్లు, పావురములు-౯=కలరవపక్షులు.

తే. పుడమిలోపలఁ జదువులపులుఁ గనంగఁ
జిగురువిలుకాని తేజి ¦ నాఁ దొగరుముక్కు
పులుఁ గనఁగఁ బచ్చఱెక్కలపులుఁ గనంగఁ
జిలుక యన నొప్పుఁ గీరంబు ¦ శ్రీమహేశ. 14

టీ. చదువులపులుఁగు=చదువులు గలపక్షి, చిగురువిలుకాని తేజి=మన్మథునివాహనము, తొగరుముక్కుపులుఁగు=ఎఱ్ఱని ముక్కుగలపక్షి, పచ్చఱెక్కలపులుఁగు=పచ్చని ఱెక్కలుగలపక్షి, చిలుక-౫=కీరము.

తే. బట్టికాఁ డన గోరవంక ¦ పిట్ట యనఁగఁ
బరఁగు శారిక యేట్రింత ¦ పసులపోలి
గాఁడు కూఁకటిమూఁగ నాఁ ¦ గను జెలంగు
నిల భరద్వాజవిహంగంబు ¦ నీలకంఠ. 15

టీ. బట్టికాఁడు ॥పా॥ బట్టుకాఁడు, గోరవంకపిట్ట - ౨=శారిక. ఏట్రింత, పసులపోలిగాఁడు, కూఁకటిమూఁగ-౩=భరద్వాజపక్షి.

తే. జాలె డేగ నఁ గురుజు నా ¦ సాళ్వ మనఁగఁ
గణుజు నాఁగను జలకట్టె ¦ యనఁగ వేస
డం బనఁగ గిద్దు నా నోర ¦ ణం బనంగ
శ్యేనభేదంబు లగు మహా ¦ సేనజనక. 16

టీ. జాలె, డేగ, కురుజు, సాళ్వము, కణుజు, జలకట్టె, వేసడము, గిద్దు, ఓరణము-౯=శ్యేనవిశేషములు.

తే. కోటఁ డనఁగను గూబ నా ¦ ఘూక మమరు
జిలుతగూబ యనంగఁ బ ¦ కసిండికంటె
యనఁగ సకినాలపులుఁ ¦ గన నలరు చుండుఁ

బృథివిఁ గనకాక్షి యనుపక్షి • శ్రీమహేశ. 17

టీ. కోటఁడు, గూబ-౨=ఘూకము. చిఱుతగూబ = చిన్నగూబ, పసిఁడికంటి = బంగారమువంటి నేత్రము లుగలది, సకినాలపులుఁగు= శకున ములపక్షి-3 కనకాక్షి యనుపక్షి.

తే. పాము సప్పంబు నిడుపఁడు • పడగదారి
గాలిమేఁతరి విసదారి • కానరాని
కాళ్లయది చిల్వ వీనుల•కంటి పుట్ట
పెట్టెప ట్టనఁ జను నహి•పేళ్లు భర్గ. 18

టీ. పాము,సప్పంబు (ప్ర. సర్పము),నిడుపఁడు=చిరకాలముగానుం డునది,పడగదారి=పడగనుధరించినది,గాలిమేఁతరి=వాయుభక్షణము సేయు నది,విసదారి=విషమునుధరించినది, కానరానికాళ్లయది=అదృశ్యపాదములు గలది, చిల్వ, వీనులకంటి=చెవులే కన్నులుగాఁగలది, పుట్టపెట్టెపట్టు = వ ల్మీకమును బెట్టెయును నివాసముగాఁ గలది-౧౦=సర్పము.

క. ఇల నెంచ రుధిరమున కా
ఖ్యలు నల్ల యనంగ నెత్తు • రనఁగ ధరిత్రిం
బొల యీరు వెఱచి నంజుడు
పొల సన నివి పరఁగు మాంస•మునకు మహేశా. 19

టీ. నల్ల, నెత్తురు-౨=రక్తము. పొల, ఈరువు, ఎఱచి, నంజుడు, పొలసు-౫ =మాంసము.

క. భర్గుఁడు కాశీనిలయుఁడు
దుర్గాపతి యొసఁగు ముదము•తో నీతిర్య
గ్వర్గ లిఖించినఁ జదివిన
దౌర్గత్యము లణఁచి సంప•దలు నిత్యంబున్. 20

———

## * నానార్థవర్గు.

క. కలు పనఁ బేరగు దధికిం
గలు పన సస్యంబులోని కగాదము పేరా
వెలు గంద్రు కంపకోటను
వెలుఁ గందురు ప్రభను జనులు విశ్వాధిపతీ. 1

టీ. కలుపు = దధి, పైరులోనికసవు. వెలుఁగు = కాంతి, వెలుగు = కంపకోట.

క. మావు లనం దగు హయములు
మావు లనం బరఁగు నామ్రమహీజంబు లిలం
దావు లనఁ స్థల మొప్పును
దావు లనఁ వాసనలకుఁ దగుఁ బేరు శివా. 2

టీ. మావులు = (మావు + లు) గుఱ్ఱములు, (మావి×లు) మామిడిచెట్లు. తావులు= (తావు + లు) స్థలములు, (తావి + లు) వాసనలు.

క. ఇమ్మహిలోపలఁ బేరగుఁ
గొమ్మ యనఁ వృక్షశాఖకును భామినికిం
దమ్ము లనం బేరగుఁ బ
ద్మములకనుజన్ములకును దరుణేందుధరా. 3

టీ. కొమ్మ=వృక్షశాఖ, స్త్రీ. తమ్ములు = (తమ్మి + లు) పద్మములు, (తమ్ము+లు) అనుజులు.

క. ఇమ్ములఁ బేరగుఁ దాటం

---

* ఇందు వెలుగు మొదలగు కొన్నిపదములకు అరసున్నయుండఁగా ఒక యర్థమును, లేనపుడు మఱియొక యర్థమును, తావులు మొదలగువానికి ఏకవచనమున రూపభేదమున్నను బహువచనమున రూపసామ్యమునుబట్టి నానార్థములును కనఁబడుచున్నవి.

కమ్ములకును లేఖలకును గమ్ము లనగ నా
మమ్ము దగుం గంఠాభర
ణమ్మునకును లతకుఁ దీఁగె నా గౌరీశా. 4

టీ కమ్ములు=తాటంకములు, జాబులు. తీఁగె=కంఠాభరణము (మెడనూలు.), లత.

క. చెల్లును బే ళ్లై ధరలోఁ
దా ళ్లన సూత్రంబులకును దాళంబులకుం
గో ళ్లనఁ గుక్కుటములకును
బే ళ్లగు ఖట్వాంగములకుఁ బే ళ్లగు నభ నా. 5

టీ తాళ్లు=(తాడు + లు) సూత్రములు, (తాడి + లు) తాళవృక్షములు. కోళ్లు=(కోడి + లు) కుక్కుటములు, (కోడు+లు)=మంచముకోళ్లు.

క. చామ యన సస్యమునకును
భామినికిని నాఖ్య యగుచుఁ బరఁగు ధరిత్రిన్
నామము లగుచును వెలయును
బాములు లనగ జన్మములకు భంగమ్ములకున్. 6

టీ. చామ=సస్యవిశేషము, స్త్రీ). బాములు = జన్మములు, భంగపెట్టుటలు.

తే. దంట యనఁగ నభిఖ్య యై తనరు చూడు
జగతిలోపలఁ బ్రౌఢకు యుగళమునకుఁ
బఱ పనంగ నభిఖ్య యాఁ బానుపునకు
వి స్తృతమునకు శైలనికేతేశ యీశ. 7

టీ. దంట=ప్రౌఢ స్త్రీ), జంట. పఱపు=పానుపు, విస్తృతము.

క. తొలి యనఁగా నగు నామం
బులు పూర్వంబునకు నుషిరకమునకును ధరలో

వెలి యనఁగ బహిర్ధవళం
బులకును నామంబు శేషభుజగవిభూషా. 8

టీ. తొలి=పూర్వము, రంధ్రము. వెలి=బయలు, ధవళవర్ణము.

క. నెమ్మి యనఁగ వంజులవృ
క్షమ్మునకుఁ బర్హికిని సుఖస్థితికిని నా
మమ్ముగఁ దగు నతిధీర య
హమ్మతిజనదూర పన్నగాధిపహారా. 9

టీ. నెమ్మి=వంజులవృక్షము, నెమిలి, సుఖముగా నుండుట.

క. పాలం బేరగు చుంగును
బా లనఁగా క్షీరమునకు భాగంబునకుం
గా లనఁ బేరగు నాలవ
పాలికిఁ బాదంబునకును బాలేందుధరా. 10

టీ. పాలు = క్షీరము, భాగము. కాలు=నాలవపాలు, పాదము.

క. మే లన శుభంబు పేరగు
మే లన నుపరికిని గూరిమికినిం బేరా
మే లన మెచ్చునఁ బల్కిన
యాలాపంబునకు నాఖ్య యగు జగదీశా. 11

టీ- మేలు=శుభము, మీఁదు, కూరిమి, మెప్పుచేతఁ బలికిన మాట.

క. ధారుణిఁ బేరు వహించును
బూరుగు నా నూఁదువాద్యమును శాల్మలియుం
బే రన నభిధానం బగు
హారమునకు నామమునకు నంబరకేశా. 12

టీ. బూరుగు=ఊఁదునట్టి వాద్యము, శాల్మలీవృక్షము. పేరు=హారము, నామధేయము.

క. కప్పన నీలిమపేరగుఁ
గప్పనఁగా నింటిమీఁదికసవుకుఁ బేరౌఁ
గొప్పనఁ దగుఁ జూపాగ్రము
నొప్పగు ధమ్మిల్లమును గృహపాళియు శివా. 13

టీ. కప్పు=నలుపువర్ణము, ఇంటిమీఁదవేయుపూరికసవు. కొప్పు=నింటి కొన, స్త్రీలకొప్పు, ఇంటినడికొప్పు.

క. ఒకభూరుహమునకును ధమ
నికిఁ బేరగుఁ గ్రోవి యనఁగ నెఱి నట్టుల వే
ఱొకభూజమునకు నధరము
నకుఁ బేరగుఁ మోవి యనిన నగరాట్చాపా. 14

టీ. క్రోవి=కురవకవృక్షము, గొట్టము. మోవి=ఒకవృక్షవిశేషము, అధరము.

క. చవు లనఁగా నభిధానము
లవు షడ్రుచులకును ముత్తియపుటెత్తులకున్
భువిలోపల నామము లగు
గవు లన గుహలకును బూతిగంధంబునకున్. 15

టీ. చవులు=షడ్రుచులు, ముత్యములయెత్తులు. గవులు = (గవి+లు, పర్వతగుహలు, దుర్గంధము (ఈయర్థమునం దిది ఏకవచనము).

తే. ఆఖ్య యై యొప్పు ధరణిలో నపరదివస
మునకు ఛత్రంబునకు నెల్లి యనెడునుడువు
జక్కి యనుపేరు పరఁగును సైంధవంబు
నకు ఘరట్టంబునకును గంధర్పదమన. 1

టీ. ఎల్లి=అపరదివసము, ఛత్రము. జక్కి=గుఱ్ఱము, తిరుగలి.

తే. ఆడ నను మాట నటియించె ననుటకును వ

చించె ననుటకు మఱియు నిం౯దించె ననుట
కాఖ్య లగుచును శోభిల్లు ౯ నాలు నాఁగ
గోవులకు భార్యకును బే ర౯గుఁ మహేశ. 17

టీ. ఆడెను=నటియించెను, వచించెను, నిందించెను. ఆలు=(ఆవు+లు-బహువచనము) గోవులు, భార్య (ఏకవచనము).

సీ. రజతపునఃపదా౯ర్థములకు నభిధాన
మగు వెండి యన బంతి ౯ యనఁగఁ గందు
కమునకు శ్రేణికి ౯ నమరు నాహ్వాయముగా
దండ యనం బుష్ప౯దామమునకు
నంతికంబునకుఁ బే ౯ రగు దొర యన నాఖ్య
యగు సదృశమునకు ౯ నవనిపతికి
నస్త్రసంఖ్యకు నహ ౯ మ్మనుటకు నాహ్వాయం
బగు నే ననఁగ సరి ౯ యనఁగ సదృశ

తే. మునకు సమసంఖ్యకును నామ౯ముగ నెసంగు
గొం తనఁగ నాహ్వాయం బగుఁ ౯ గుక్కుటాస
నంబునకుఁ గంఠమునకును ౯ నల్ల యనిన
రక్తనీలాఖ్య లై యొప్పు ౯ రాజమకుట. 18

టీ. వెండి=రజతము, పునఃపదార్థము. బంతి=కందుకము, శ్రేణి. దండ=పుష్పమాల, సమీపము. దొర=సమానము, రాజు. ఏను=పంచసంఖ్య, నేను. సరి=సమానము, సమసంఖ్య. గొంతు = కుక్కుటాసనము, కంఠము. నల్ల = నెత్తురు, నీలవర్ణము.

సీ. తీరంబునకు ధరి౯త్రీధరంబునకు స
మాఖ్య లై యొప్పుఁ గ౯ట్టనఁగ నీశ
కేతువునకుఁ గాంతి౯కిని సమాహ్వాయ మగు

డా లనంగిను మేరుశైలచాప
శౌర్యధుర్యునకు లాంఛనమునకును నామ
మగు బిరు దనఁగఁ బన్నగవిభూష
గూబ నా నాఖ్య యా ఘూకంబునకుఁ గర్ణ
మూలంబునకు నవిముక్తనిలయ
తే. యంతికంబునకును సమూహంబునకును
నామ మై యొప్పుఁ జేరువ నాఁగ నభవ
సమభిధాన మై యొప్పుఁ బిశాచమునకుఁ
బవనమునకును గాలి యన్పలుకు రుద్ర. 19

టీ. గట్టు = నద్యాదితీరము, పర్వతము. డాలు=ధ్వజము, కాంతి. బిరుదు=శూరుఁడు, లాంఛనము. గూబ=ఘూకము, కర్ణమూలము. చేరువ= సమీపము, సమూహము. గాలి=పిశాచము, వాయువు.

క. ఇలలోపల నామం బగుఁ
బలుకులు నా శకలములకు భాషణములకుఁ
నెల యన నభిధానం బగు
జలజారికి మాసమునకు శైలనిశాంతా. 20

టీ. పలుకులు=తునియలు, వచనములు. నెల = చంద్రుఁడు, మాసము.

సీ. అంతర్హితుం డయ్యె ననుటకు నాగతుం
డయ్యె ననుటకు సమాఖ్య యగుచు
నలరును విచ్చేసె ననుట యంబరకేశ
నెఱి సమాహ్వాయ మగుఁ గఱచె ననఁగ
నభ్యాస మొనరించె ననుటకు దంతపీ
డ యొనర్చె ననుటకు నయుగ్మనయన
వెలయుఁ దత్తక్షరమునకు నభిజ్ఞకు

నాఖ్యమై యానవాలనుట యాళ
తే. పఱచె ననఁగ సమాఖ్య యా బాధచేసెఁ
బ్రచలితుం డయ్యె ననుటకు బాండురాంగ
పరఁగ మోహించె ననుటకుఁ బరిమళించె
ననుట కొప్పును వలచె నా నళికనేత్ర. 21

టీ. విచ్చేసెను॥పా॥ వేంచేసెను=పోయెను,వచ్చెను. కఱచెను=అభ్య
సించెను, కొఱికెను. ఆనవాలు=కాఁగినపాలు, చిహ్నము. పఱచెను=భంగ
పఱిచెను, పలాయితుండయ్యెను. వలచెను=మోహించెను, పరిమళించెను.

సీ. ఆనె నంట సమాఖ్య యాను వహించెఁ బా
నము చేసె ననుటకు నగనివేశ
చషకంబునకును దంష్ట్రకు నాఖ్య యగాఁ గోర
యనఁగ శశాంకకళావతంస
మొక్కలీఁ డనఁగఁ గొమ్ములు లేనికరికి ము
ష్కరునకుఁ బేరగు గరళకంఠ
మరకతచ్ఛవికి నంబరమున కగుఁ బేరు
పచ్చడం బనిన నంబాకళత్ర
తే. క్షితిని దురగీపతికి వృత్తశిలకు నామ
ధేయమై యొప్పు గుండు నాఁ ద్రిపురహరణ
నామ మానొక్క సస్యంబునకును లోప
మునకుఁ గొఱ్ఱ యనంగ నంబుదనిభాంగ. 22

టీ. ఆనెను=భరించెను, పానముచేసెను. కోర=గిన్నె,కోఱ=కోఱ
పల్లు. మొక్కలీఁడు=కొమ్ములు లేనియేనుఁగు, ముష్కరుఁడు. పచ్చడంబు=
మరకతకాంతి, అంగవస్త్రము. గుండు = మగగుఱ్ఱము, గుండుకాయి.
కొఱ్ఱ=ఒకదినుసు ధాన్యము, తక్కువ.

సీ. తాల్చు నాఖ్యను వధూధమ్మిల్లభారంబుఁ
గోణంబు మూల నాఁ గుధరచాప
కొఱ యనునాఖ్యచేఁ గొఱలు లోపంబు మ
నోజ్ఞవస్తువు దక్షయజ్ఞమథన
నెఱి హేయపడియె నన్వేషించె ననురెంటి
కాఖ్య యా రోసె నా నసితకంఠ
నరసె నాఁ బేరగు నార్తి వారించె వి
మర్శించె ననుటకు మదనదమన
తే. చరణమునకు నధఃప్రదేశంబునకు స
మాఖ్య యై యొప్పు నడుగు నా నలికనేత్ర
మహిని బేరగు చుండుఁ బ్రమాణికంబు
నకును భాషకు బాస నా నగనివేశ. 23

టీ. మూల=స్త్రీలకొప్పు, దిక్కు. కొఱ=తక్కువ, మనోజ్ఞవస్తువు. రోసెను=అసహ్యించుకొనెను, వెదకెను. అరసెను=బాధను బోఁగొట్టెను, విచారించెను. అడుగు=పాదము, క్రిందప్రదేశము. బాస=ఒట్టు, భాష.

సీ. నాగవాస మన ఘంటాప్రతీకమునకు
వేశ్యల కగుఁ బేరు విశ్వనాథ
నామ మా నందంబునకు నంధకునకును
గ్రుడ్డనంగను రౌప్యకుధరనిలయ
చర్మవాద్యమున కుష్ణమునకుఁ బేరగు
నుడు కనియెడు నాఖ్య యుడుపమకుట
యభిధాన మగు మేడి యన హలాంగమున కు
దుంబరమునకును ధూతకలుష

తే. కల్లనఁగ శిల సురయు నౌ • గరళకంఠ
పరఁగు నాఖ్యయు లాంగలపద్ధతికిని
శ్రేణికిని జా లనంగ భసితసితాంగ
వారిధినిషంగ కాశీనివాసలింగ. 24

టి. నాగవాసము=ఘంటావయవము, వేశ్యాసమూహము. గుడ్డు=అండము, అంధకుఁడు. ఉడుకు=చర్మవాద్యము, ఉష్ణము. మేఁడి=నాఁగేటియవయవము, (మేడి)=అత్తిచెట్టు. కల్లు=తాయి, సుర. చాలు=నాఁగేటిచాలు, బంతి.

తే. జననికిని మాతృజననికి • జనకజనని
కాఖ్య యగు నవ్వ యనఁగ నాచార్యసహాయ
భగినికిని జనకునకు నాహ్వాయము దనరు
నప్ప యనఁగను జంద్రరేఖావతంస. 25

టీ. అవ్వ=తల్లి, తల్లితల్లి, తండ్రితల్లి, అప్ప=అక్క, తండ్రి.

క. పో తనఁగఁ బరఁగు మహిమము
భూతలమునఁ బురుషమృగముఁ • బురుషఖగంబుం
దా తన ధాతృపితామహ
మాతామహులకును నగు సమాఖ్య మహేశా. 26

టీ. పోతు=మహిమము, పురుషమృగము,పురుషపక్షి. తాత=బ్రహ్మ, తండ్రితండ్రి, తల్లితండ్రి.

క. పుడమిని బేరు వహించును
వడి గలవాఁ డనఁగ శౌర్యవంతుఁడు జవియుక్తా
నడు మన నవలగ్నముఁ జె
న్నడరఁగ మధ్యస్థలంబు • నగు నగధన్వా. 27

టీ. వడిగలవాఁడు = శౌర్యముగలవాఁడు, వేగముగలవాఁడు. నడుము=కౌను, మధ్యప్రదేశము.

క. ఎద యనఁగఁ బరఁగు భీతికి
హృదయమునకు వృషమునకు నిల జోడనఁగా
నది దనరు నామ మగుచును
సదృశమునకు వర్మమునకుఁ జంద్రార్ధధరా. 28

టీ. ఎద=భయము, మనస్సు, ఆఁబోతు. జోడు=సమానము, కవచము.

క. నానార్థవర్గ మిది స
న్మానముతో దీనిఁ జదివినను వ్రాసిన నా
మానవుల కబ్బు నెప్పుడు
నానార్థంబులును విశ్వనాథునికరుణన్. 29

గద్య. ఇది శ్రీమదేకామ్రమంత్రిపుత్త్ర కౌండిన్యగోత్రపవిత్ర
సదారాధితమహేశ్వర పైఁడిపాటి లక్ష్మణకవిప్రణీతం బైన
యాంధ్రనామసంగ్రహం బనునిఘంటువునందు
సర్వంబు నేకాశ్వాసము సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# సటీకాంధ్ర నామశేషము.

---

అవతారిక.

అడిదము-సూరయ్య యనుకవి యాంధ్రనామ శేష మను నిఘంటువును రచింపఁబూని యిది నిర్విఘ్నముగా సమాప్తి నొందుటకుఁగాను గ్రంథనాయకుఁ డగునీశ్వరునిసంబోధనరూపముగాఁ బ్రార్థించి తదంకితముగా గ్రంథనామపూర్వక ప్రతిజ్ఞను రెండుపద్యములచేతఁ జేయుచున్నాఁడు:—

క. శ్రీగౌరీప్రియవల్లభ
రాగద్వేషాదిరహిత రమ్యచరిత్రా
యోగిధ్యేయపదాంబుజ
భోగివలయ రామచంద్రపురవరనిలయా.

టీ. శ్రీగౌరీప్రియవల్లభ=శోభాయుక్తురాలయినపార్వతీదేవికిప్రియభర్తయును, రాగద్వేషాదిరహిత = రాగద్వేషాదిదోషములు లేనివాఁడును, రమ్యచరిత్రా = మనోహరమైన చరిత్రములు గలవాఁడును, యోగిధ్యేయపదాంబుజ=యోగీశ్వరులచేతధ్యానము సేయఁదగినపాదారవిందములుగలవాఁడును, భోగివలయ=సర్పములు హస్తకంకణములుగాఁ గలవాఁడును, రామచంద్రపురవరనిలయా=శ్రేష్ఠమైన రామచంద్రపురము నివాసముగాఁగల వాఁడును అగు ఓయీశ్వరా.

వ. అవధరింపుము.

ఆ. ఆంధ్రనామసంగ్రహమునందుఁ జెప్పని
కొన్ని తెనుఁగుమఱుఁగు లన్ని కూర్చి
యాంధ్రనామశేష మను పేరఁ జెప్పెద
దీనిఁ జిత్తగింపు దేవదేవ.

టీ. అవధరింపుము=సావధానచిత్తుఁడవై యాలకింపుము. ఆంధ్రనామసంగ్రహమునందుఁ=లక్ష్మణవికృత మగు నాంధ్రనిఘంటువునందు, చెప్పని=తెలియఁజేయనటువంటి, కొన్ని తెనుఁగు మఱుఁగులు=సర్వసాధారణముగాఁ దెలియశక్యముగానికొన్ని యాంధ్రశబ్దములను, అన్ని=అన్నిటిని, కూర్చి=పర్యాయపదములతో సమర్చి, ఆంధ్రనామశేషము=ఆంధ్రనామసంగ్రహమునందుఁ జెప్పఁగా మిగిలినవానిని జెప్పెడిగ్రంథము, అను=అనెడి, పేరఁ=పేరితో, చెప్పెదఁ=ఇఁకమీఁదఁ జెప్పుచున్నాను. చిత్తగింపు=మనఃపూర్వకముగా నంగీకరింపుమా.

క. తటి యజ్జ దనన సమయం
బుఱుఁ డనఁగను సరకుసేయకుండె ననఁగఁ బే
ల్లొఱ పగు గణింపఁ డనుటకుఁ
గరిచర్మాంబర త్రినేత్ర గౌరీమిత్రా. 1

టీ. తటి, అజ్జ, అదను-౩=సమయము. ఉఱుఁడు, సరకుసేయకుండెను. ల్లొఱ=గణింపఁడు.

తే. పెంపు సెందెను దామరతంప రయ్యెఁ
బ్రబలె నెగడెను గొనసాగె బలిసె పెరిఁగె
ననఁగ రేకెత్తె ననఁగఁ జేళ్లయ్యె వృద్ధిఁ
బొందె ననుటకు శేషాహిభూషితాంగ. 2

టీ. పెంపుసెందెను, తామరతంపరయ్యెను, ప్రబలెను, నెగడెను, కొనసాగెను, బలిసెను, పెరిఁగెను, రేకెత్తెను-౮=వృద్ధిఁబొందెను.

తే. పేర్మి యర్మిలి మక్కువ కూర్మి నెమ్మి
నెనరు గాదిలి గారాము నెయ్య మింపు
ప్రేముడి యనుంగు ముద్దనఁ బ్రియమునకును
నామధేయంబు లయ్యెఁ బినాకపాణి. 3

టీ. పేర్మి, అర్మిలి, మక్కువ, కూర్మి, నెమ్మి, నెనరు, గాదిలి, గారాము ॥రూ॥ గారము, నెయ్యము, ఇంపు, ప్రేముడి, అనుఁగు, ముద్దు-౧౪=ప్రియము.

క. ఒనగూర్చె ననఁగ సమకూ
ర్చె ననఁ బిల్పతిచె ననఁగఁ జేకూర్చెను నా
ననుకూలపఱిచె ననుటకుఁ
దనరును నామంబులై సుధాకరమకుటా. 4

టీ. ఒనగూర్చెను, సమకూర్చెను, పిల్పతిచెను (పిలుపతిచెను), చేకూర్చెను-౪=అనుకూలపఱిచెను.

క. చరియించె ననుట కాఖ్యలు
తిరిగెను జెరలాడె ననఁగఁ ద్రిమ్మరె ననఁ గ్రు
మ్మరె ననఁగ మసలె ననఁగాఁ
బురదానవహరణ శేషభుజగాభరణా. 5

టీ. తిరిగెను, చెరలాడెను, త్రిమ్మరెను, క్రుమ్మరెను, మసలెను-౫=చరియించెను.

తే. ఆటుమూఁడయ్యెఁ గచ్చువిచ్చయ్యె ననఁగ
జెడిసె బుసిపోయె ననఁగను జెడియె ననఁగ
నాఖ్య లగుఁ గార్యవైకల్య మయ్యె ననుట
కంధకాసురహరణ రాజాద్రిశరణ. 6

టీ. ఆఱుమాఁడయ్యెను, గచ్చువిచ్చయ్యెను, బెడిసెను, బుసిపోయెను, చెడియెను-౫=కార్యముచెడెను.

క. అలజడి నెంజలి పిమ్మట
సిలు గుత్తలపాటు వంత సేగి నెగుల్ గొం
దల మలమ టడరు గోడు
మ్మలిక వనట కుందు నా సమరు దుఃఖాఖ్యల్. 7

టీ. అలజడి, నెంజలి, పిమ్మట, సిలుగు, ఉత్తలపాటు, వంత, సేగి, నెగులు, కొందలము, అలమట, అడరు, గోడు, ఉమ్మలిక॥రూ॥ఉమ్మలికము, వనట, కుందు-౧౫=దుఃఖము.

క. అరిది వెఱఁ గచ్చెరు వ
బ్బుర మబ్రం బనఁగఁ జిత్రమునకుం బేళ్లౌ
సరణికిఁ బేళ్లగుఁ ద్రోవనఁ
దెరు వన దారి యన బాట తెన్నన నభవా. 8

టీ. అరిది, వెఱఁగు, అచ్చెరువు, అబ్బురము, అబ్రము-౫=చిత్రము. త్రోవ, తెరువు, దారి, బాట, తెన్ను-౫=మార్గము.

తే. ఐదుపదిచేసె వెనుకముందయ్యె జుణిఁగె
వీఁగె వెన్నిచ్చె వెనుకంజవేసె ననఁగ
నోహటించె ననంగఁ బేళ్లొప్పు చుండు
నాహవపరాఙ్ముఖుం డయ్యె ననుట కభవ. 9

టీ. అయిదుపదిచేసెను (ముందు పెట్టినకాలిని మరలవెనుక కాలితోఁజేర్చుట), వెనుకముందయ్యెను. జుణిఁగెను, వెన్నిచ్చెను, వెనుకంజవేసెను, ఓహటించెను-౭=యుద్ధమందు పరాఙ్ముఖుఁడయ్యెను.

తే. మోహరించెను దండెత్తె మొనసె దాడి
చేసెఁ బోటాగ్గెఁ గోత్తలచేసె మాఱు

కొనియె దళమెత్తె ననఁగఁ బేళ్లొనరుచుండు
నాహవోద్యోగ మొనరించె ననుటకభవ. 10

టీ. మోహరించెను, దండెత్తెను, మొనసెను, దాడిచేసెను, పోటాగ్గను, కోల్తలచేసెను, మాఱుకొనియెను, దళమెత్తెను-౮=యుద్ధప్రయత్నము చేసెను.

తే. ఆహవోన్ముఖతకు నోలమాసగొనక
పిఱుతివియ కీడఁబోకనఁ బెల్లు దనరు
నబ్బస మొనర్చెఁ గఱచె నాసభ్యసించె
ననుట కభిధానములు చంద్రమోవతంస. 11

టీ. ఓలమాసగొనక, పిఱుతివియక, ఈడఁబోక-౩=వెనుదీయక. అబ్బస మొనర్చెను, కఱచెను-౨= అభ్యసించెను.

క. వేఱొకటనఁ బైపెచ్చన
మాఱట యిమ్మడి యనఁగ సమాహ్వయములు వెం
పారును వస్త్వంతరమున
కారగ కేయూరసహిత హతమారజితా. 12

టీ. వేఱొకటి, పైపెచ్చు, మాఱట, ఇమ్మడి-౪=వస్త్వంతరము.

సీ. ఆఱడిఁబోయెను బీఱువోయెను రిత్త
వోయెను పీసరవోయె ననఁగ
నుడివోయెఁ బొలివోయె సుడివోయె ననఁగను
వ్యర్థమయ్యె నటంచు నాఖ్యలయ్యెఁ
గడిమి బిరంబు మగంటిమి గండన
విక్రమాహ్వయము లై వెలయుచుండు
నాస్ఫాలన మొనర్చె ననుటకుఁ జఱచె నా
నప్పళించె ననంగ నాఖ్యలయ్యెఁ

గీ. నొగి వరుస యోలి సొరిది నా నోజ నాఁగఁ
క్రమమునకు నాఖ్య లయ్యెను గాలకంఠ
కొఱ కొఱఁత తక్కువ వెలితి కొదవ కడమ
యనఁగ నూనంబునకు నాఖ్య లై తనర్చు. 13

టీ. ఆఱడిఁబోయెను, బీఱువోయెను, రిత్తవోయెను, వీసరవోయెను, ఉడివోయెను, పొలివోయెను, సుడివోయెను - ౭=వ్యర్థమయ్యెను. కఱుమి, బీరము, మగఁటిమి, గండు-౪=విక్రమము. చఱచెను, అప్పళించెను-౨=ఆస్ఫాలన మొనర్చెను. ఒగి, వరుస, ఓలి (ప్ర. ఆలి), సొరిది, ఓజ-౫=క్రమము. కొఱ, కొఱఁత, తక్కువ, వెలితి, కొదవ, కడమ-౬=ఊనము.

తే. నెట్టుకొనెఁ బొలుపడె నొడిగట్టె ననఁగఁ
గడఁగెఁ దొడఁగెను జెలరేఁగెఁ గాలుద్రొక్కెఁ
గవిసెఁ గదిసె ననఁగ నాఖ్య లయి యొప్పు
నభిముఖుం డయ్యె ననుటకు నగనివేశ. 14

టీ. నెట్టుకొనెను, పొలుపడెను, ఒడిగట్టెను, కడఁగెను, తొడఁగెను, చెలరేఁగెను, కాలుద్రొక్కెను, కవిసెను, కదిసెను-౯=అభిముఖుఁడయ్యెను.

తే. అగపడకపోయె విచ్చుమొగ్గయ్యె ననఁగఁ
గంటఁ బడదయ్యెఁ బంచబంగాళ మయ్యె
ననఁగ దృగగోచరం బయ్యె ననుట పేళ్లు
శయఘటితశూల వైయాఘ్రచర్మచేల. 15

టీ. అగపడకపోయెను, విచ్చుమొగ్గయ్యెను, కంటఁబడదయ్యెను, పంచబంగాళమయ్యెను-౪=దృగగోచరంబయ్యెను.

క. వెలిచవి చీఁకటితప్పనఁ
బొలుపారఁగ జారభావమునకుం బేళ్లౌఁ
బులుకసటు చిలుమనంగను

మలిన మనుట కాఖ్య లయ్యె మనసిజదమనా. 16

టీ. వెలిచవి, చీఁకటితప్పు-2=జారభావము. పులు, కసటు, చిలుము-3=మలినము.

ఆ. వింగడం బనంగ విపరీత మగు నుక్కి-
వం బనఁగను గుత్సితంబు పరఁగు
నాఖ్య యగుచుఁ దనరు నా మని యనఁగను
మదమునకును జంద్రమఃకలాప. 17

టీ. వింగడము=విపరీతము. ఉక్కివము=కుత్సితము- ఆము=మదము.

క. ఎల యండ్రు తరుణ మనుటకుఁ
గొల యన దురితంబుపేరు కుడియెడమ లనన్
వలపల దాపల లనఁగను
బొలుపుగ నపసవ్యసవ్యములకుం బేళ్లౌ. 18

టీ. ఎల=తరుణము. కొల=దురితము. కుడియెడమలు, వలపలదాపలలు-2=అపసవ్య సవ్యములు-అనఁగా దక్షిణవామభాగములు.

క. తగు నౌద్ధత్యముపే ళ్లై
పొగ రన నా మనఁగఁ దుళ్లు పోతర మనఁగా
నెగడును భయంబుపే ళ్లై
బెగడు దిగులు వెఱపు జంకు బీ తళు కనఁగన్. 19

టీ. పొగరు, ఆము, త్రుళ్లు, పోతరము-4=ఔద్ధత్యము.(గర్వము) బెగడు, దిగులు, వెఱపు, జంకు, బీకు, అళుకు-6=భయము.

క. అరి యనఁ గప్పం బనఁగాఁ
గరమునకుం బేళ్లు కాఁగు కడవ పనఁటి నాఁ
బరఁగు ఘటాఖ్యలు నమితా
మరమానినికాయ భూతిమండితకాయా. 20

టీ. అరి, కప్పము-౨=పన్ను. కాఁగు, కడవ, పనఁటి॥రూ॥పంటి-౪=ఘటము.

తే. అలరుచుండును గొండ్లి రంతు తనఁగఁ గేళి
హాని కాఖ్యలు చేటు కీడలు యనంగ
హెచ్చరిక హాళి సంతసం బెలమి వేడ్క-
యనఁగ నానందమున కాఖ్య లై తనర్చు. 21

టీ. గొండ్లి, రంతు-౨=కేళి. చేటు,కీడు, అలు-3=హాని. హెచ్చరిక, హాళి, సంతసము.(ప్ర. సంతోషము), ఎలమి, వేడ్క-(వేడుక)-౫ఆనందము.

క. సాహిణ మనఁ బాగా యన
వాహాగారంబునకును బవ్ర్తిలుఁ బే ళ్లై
వ్యూహమున కాఖ్య లయ్యెను
మోహర మన నొడ్డనంగ బొగ్గర మనఁగన్. 22

టీ. సాహిణము, పాగా - ౨ = అశ్వశాల. మోహరము, ఒడ్డు, మొగ్గరము-3=వ్యూహము.

క. ఒనరించె ననఁగఁ గావిం
చె ననంగను జలిపె ననఁగఁ జేసె ననంగాఁ
జను నాచరించె ననుటకుఁ
గనకాచలచాప చంద్రఖండకలాపా. 23

టీ. ఒనరించెను, కావించెను, చలిపెను- చేసెను-౪=ఆచరించెను.

తే. చీకువా లిరు లనఁగను జీఁకటి యనఁ
దిమిరమునకు నభిఖ్య లై తేజరిల్లు
నాఖ్య లై తనరారు నుపాయమునకు
సుళు వనఁగ వెర వనఁగను సూటి యనఁగ. 24

టీ. చీకువాలు, ఇరులు, చీఁకటి - 3=తిమిరము (అనఁగా అంధకారము). సుళువు, వెరవు, సూటి-=ఉపాయము.

తే. చేరువయ్యెను డాసెను దారసిల్లె
ననఁగ సన్నిహితం బౌట కాఖ్య లయ్యె
స్థూల మనుటకుఁ బేళ్లగుఁ దోర మనఁగఁ
గడిఁది వలుఁద యనంగను గాలకంఠ. 25

టీ. చేరువయ్యెను, డాసెను॥పా॥దాసెను, తారసిల్లెను-౪=సన్నిహితమవుట(అనఁగాసమీపించెననుట). తోరము,కడిఁది, వలుఁద-౩=స్థూలము.

తే. వాడెఁ గనుగందె ననఁ బుయిలోడె ననఁగ
విన్నవోయె ననంగను జిన్నఁబోయె
ననఁగఁ బేళ్లగు నివి ఖిన్నుఁ డయ్యె ననుట
కంధకాసురహరణ రౌప్యాద్రిశరణ. 26

టీ. వాడెను, కసుగందెను, పుయిలోడెను, విన్నవోయెను, చిన్నఁబోయెను-౫=ఖిన్నుఁడయ్యెను.

క. గరువము మురిపం బనఁగను
బరఁగుఁ గర్వంబు పేళ్లు భటనామము లొం
టరి లెంక బం టనంగను
బురదానవహరణ శేషభుజగాభరణా. 27

టీ. గరువము, మురిపము-౨=గర్వము. ఒంటరి, లెంక, బంటు,(ప్రభటుఁడు)-౪=భటుఁడు.

క. అరదంబు తే రనంగను
బరఁగు రథంబునకుఁ బేళ్లు పరి యన్నను గా
లరు లనఁ బదాతిసంహతి
పురదానవహరణ శేషభుజగాభరణా. 28

టీ. అరదము, (ప్ర. రథము) తేరు-౨=రథము. పరి, కాలరులు-౨=కాల్బలము.

క. సందియ మన ననుమాన ము
నం దనరును సంశయంబునకుఁ బేళ్లిగో
బృందాహ్వయంబు లలరును
మం దనఁ గోన యనఁ జంద్రమఃఖండధరా. 29

టీ. సందియము (ప్ర. సందేహము), అనుమానము-౨=సంశయము. మంద, కోన-౨=గోసమూహము.

క. మొన వాఁగు దండు దళ మనఁ
దనరున్ సైన్యంబుపేళ్లు దళవాయి యనన్
మొనకాఁ డనంగఁ బడవా
లనఁగన్ సేనాధిపతికి నాఖ్యలు పొలుచున్. 30

టీ. మొన, వాఁగు, దండు, దళము-౪=సైన్యము. దళవాయి, మొనకాఁడు, పడవాలు-౩=సేనాధిపతి.

తే. మైకొనియె నియ్యకొనె నొడంబడియె నొప్పె
ననఁగ నంగీకరించుట కాఖ్య లయ్యె
సంఘటించుట కాఖ్య లై జానుమీఱుఁ
జెరివెఁ దుఱిమెను గీల్కొల్పెఁ జెక్కె ననఁగ. 31

టీ. మైకొనియెను, ఇయ్యకొనెను, ఒడంబడెను, ఒప్పెను-౪=అంగీకరించెను. చెరివెను, తుఱిమెను, కీల్కొల్పెను, చెక్కెను-౪=సంఘటించెను.

తే. దిట్టపడియె ముక్కాఁకలుదీఱె ననఁగ
నాఱితేఱె ననం గడిదేఱె ననఁగఁ
గసిమసంగె ననంగ నాఖ్యలు దనర్చు
నిపుణుఁ డయ్యె నటంటకుఁ ద్రిపురవైరి. 32

టీ. దిట్టపడియెను, ముక్కాఁకలుదీఱెను, ఆఱితేఱెను, గడితేఱెను, కసిమసంగెను-౫=నిపుణుఁడయ్యెను.

క. తడవు వడి కా రనంగా
నడరుం గాలంబు శిథిల మయ్యె ననుట యూ
విడె వీడె నూడె విచ్చెను
సడలె నురిలె వదలెఁ బ్రిదిలె జాఱె ననంగన్. 33

టీ. తడవు, వడి, కారు-౩=కాలము. విడెను, వీడెను, ఊడెను, విచ్చెను, సడలెను, ఉరిలెను, వదలెను, ప్రిదిలెను, జాఱెను-౯=శిథిలమయ్యెను.

క. మది డెంద ముల్ల మెద యన
హృదయంబున కాఖ్య లయ్యె నీరం బనఁగాఁ
బొదరి ల్లనఁగ నికుంజము
సదయాంతఃకరణ తరుణచంద్రాభరణా. 34

టీ. మది, డెందము, ఉల్లము, ఎద-౪=హృదయము. ఈరము, పొదరిల్లు-౨=నికుంజము.

తెగ దినుసు తోయ మనఁగను
నెగడుఁ బ్రకారంబునకును నెఱి నామము లై
మొగ మనఁగ మెక మనంగను
మృగమునకు నభిఖ్య లయ్యె మేరుశరాసా. 35

టీ. తెగ, దినుసు, తోయము-౩=ప్రకారము. మొగము, మెకము (ఈరెంటికి ప్ర. మృగము)-౨=మృగము.

క. ఎడ దవ్వు కెళ వనంగా
నడరుఁ దూరంబునకు సమాఖ్యలు నలి నాఁ
బొడి నుగ్గు తుమురు నుఱు మన
నెడఁగడరుం జూర్ణమునకుఁ బేళ్లై శర్వా. 36

టీ. ఎడ, దవ్వు, కెళవు-౩=దూరము. నలి, పొడి, నుగ్గు, తుమురు, నుఱుము-౫=చూర్ణము.

క. ప్రేరేచెను బురికొలిపెను
దాటిచె ననఁ జోదనకును దగు నాఖ్యలు పెం
పారును జంబూద్వీపము
నేరెడుదీవి తొలుదీవనెడునామములన్. 37

టీ. ప్రేరేచెను, పురికొలిపెను, తాటిచెను-3=ప్రేరణచేసెను. నేరెడుదీవి, తొలుదీవి-2=జంబూద్వీపము.

క. తొలఁగెం బాసె ననంగా
నలరుఁ విముఖతకుఁ బ్రాప్తమయ్యె ననుటపే
ళ్లలమె నొదవె దక్కొనియెను
నెలకొనియెం జెందె ననఁగ నెక్కొనియె ననన్. 38

టీ. తొలఁగెను, పాసెను-2 విముఖమయ్యెను. అలమెను, ఒదవెను, దక్కొనియెను, నెలకొనియెను, చెందెను, నెక్కొనియెను-6 ప్రాప్తమయ్యెను.

క. వెనుకఁ దరువాతఁ బిమ్మట
ననఁగా నంతట ననంగ నంత ననంగాఁ
దనరుం బశ్చాదర్థము
కనకాచలచాప చంద్రఖండకలాపా. 39

టీ. వెనుకన్, తరువాతన్, పిమ్మటన్, అంతటన్, అంతన్-5=పశ్చాదర్థము-అనఁగా అనంతరము.

క. పల్లఅవులు రజ్జు లనం
బ్రల్లదము లనంగ వ్యర్థభాషణములకుం
బేళ్లై వర్తిలు నోలిగ
నుల్లోకజయాభిసరణ యురగాభరణా. 40

టీ. పల్లఅవులు, రజ్జులు, ప్రల్లదములు-3 వ్యర్థభాషణములు.

క. కైసేఁ తలంకరించుట

బేసి యనఁగ విషమమునకుఁ ♦ గైసేఁత వెలయఁగ
సేసలు దీవనఁబ్రాలన
భాసిలు మంత్రాక్షతలకుఁ ♦ బర్యాయములై. 41

టీ. కైసేఁత=అలంకరించుట, బేసి=విషమము-అనఁగా సరిగాని సంఖ్య. సేసలు, దీవనఁబ్రాలు-౨=మంత్రాక్షతలు.

క. కోరనఁ బాలన నంశం
బేఱన వాఁక యన నదికి ♦ నెసఁగును బేళ్లై
నీరాజనంబుపేళ్లగు
నారతి నివ్వాళి యనఁగ ♦ నంగజదమనా. 42

టీ. కోరు, పాలు-౨=అంశము. ఏఱు, వాఁక-౨=నది. ఆరతి, నివ్వాళి-౨=నీరాజనము.

ఆ. మొఱవవ్రోయె ననఁగ ♦ మొద్దువ్రోయె ననంగఁ
గుంఠ మయ్యె ననుటకుం దనర్చు
శాతమునకు నాఖ్య ♦ లై తనరారును
జుఱుకు వాఁడి తెగువ ♦ కఱు కనంగ. 43

టీ. మొఱవవోయెను, మొద్దువోయెను, ౧=కుంఠమయ్యెను, చుఱుకు, వాఁడి, తెగువ, కఱుకు-౪=తీక్ష్ణము.

సీ. యామికులకు నాఖ్య ♦ లై ప్రవర్తిలు చుండు
నారెకు లనఁగఁ దళారు లనఁగఁ
గళెంబు వాగె నాఁకగను ఖలీనంబుపే
ళ్లలరు దంతంబుపే ♦ రౌ డనంగఁ
దఱపి నా ముదురు నాఁ ♦ దరుణేతరం బంట
యుం చనఁ జెఱకన ♦ నిక్షు వలరు
నష్టం బొనర్చె నంకటకు నావ్యాయము లయ్యెఁ

బోకార్చె ననఁగఁ గోల్పుచ్చె ననఁగఁ
తే. గుదె యనఁగ దు డ్డనఁగను ♦ గదకుఁ బేళ్లు
యివ మనఁగ మం చనంగను ♦ హిమముపేళ్లు
కాన యన నడవి యనంగఁ ♦ గాననంబు
షడ్గుఁడు తోడియల్లుఁడు ♦ జగలెఁ డనఁగ. 44

టీ. ఆరెకులు, తలారులు-౨=తలవర్లు. కళ్లెము. వాగె - ౨=ఖలీనము. ఔడు=దంతము.తఱపి,ముదురు.-౨-లేఁతకానిది. ఇంచు,(ప్ర. ఇక్షువు), చెఱకు-౨=ఇక్షువు. బోకార్చెను, కోల్పుచ్చెను- ౨=నష్టముచేసెను. గుదె, దుడ్డు-౨=గద. ఇవము, మంచు ౨=హిమము. కాన=(ప్ర. కాననము) అడవి-౨=అరణ్యము. తోడియల్లుఁడు, జగిలెఁడు-౨=షడ్గుఁడు.

క. తేనియ యన జున్నన నభి
ధానంబులు మధువునకును ♦ దనరుం బేళ్లై
పానకము చెఱకుపా లనఁ
గా నిక్షురసంబునకును ♦ గంతేకాలా. 45

టీ. తేనియ, జున్ను-౨=మధువు. పానకము, చెఱకుపాలు-౨-ఇక్షురసము.

క. ఉడిగెను జాలించెను నా
నడరు విరామం బొనర్చె ♦ ననుటకుఁ బేళ్లై
తొడరుం బశ్చాద్భాగము
పెడ యనఁగా వెనుక యనఁగఁ ♦ బిఱుఁదు ననంగన్. 46

టీ. ఉడిగెను, చాలించెను-౨=విరమించెను. పెడ, వెనుక,పిఱుఁదు-౩=పశ్చాద్భాగము.

క. విడుమర యన విడుదల యనఁ
గడముట్టుట యనఁగ శాంతిగనుటకుఁ బేళ్లౌ

నెడ వంక చక్కి చోటన
నడరు స్థలంబునకు నాఖ్యలై శితికంఠా. 47

టీ. విడుమర, విడుదల, కడముట్టుట-3=శాంతిగనుట. ఎడ, వంక, చక్కి, చోటు-ర=స్థలము.

క. చనుఁ గ్రుద్ధుఁ డయ్యె ననుటకుఁ
గినిసెఁ గనలె నలిగెఁ గోపగించె ననంగాఁ
దనరుఁ మర్మములకుఁ బే
ళ్లనువు లనఁగ నెఱకు లనఁగ నాయము లనఁగన్. 48

టీ. కినిసెను, కనలెను, అలిగెను, కోపగించెను-ర=క్రుద్ధుఁడయ్యెను. అనువులు, నెఱకులు, ఆయములు-3=మర్మములు.

ఆ. పరఁగుఁ బేళ్లు కార్యకరునకుఁ బార్పత్తె
కాఁ డనంగ మనియకాఁ డనంగఁ
దేజరిల్లుచుండు దేవేరి దొరసాని
రాణి యనెడుపేళ్లు రాజపత్ని. 49

టీ. పార్పత్తెకాఁడు, మనియకాఁడు-౨=కార్యకరుఁడు. దేవేరి, దొరసాని, రాణి-3=రాజపత్ని.

క. మ్రింగె నన గ్రుక్కగొనియె న
నంగం దగుఁ గబళనం బొనర్చె ననుటకున్
మ్రుంగె మునింగె ననంగ న
నంగహరా మగ్నమయ్యె ననుటకుఁ బేళ్లౌ. 50

టీ. మ్రింగెను, గ్రుక్కగొనియెను-౨=కబళనముచేసెను. మ్రుంగెను, మునింగెను-౨=మగ్నమయ్యెను.

సీ. ఆఖ్యలై తనరు ధనాగారమునకు ను
గ్రాణం బనంగ బొక్కస మనంగ

నాస్థానమంటపాహ్వాయము లై తనరు హ
జారం బనంగ మోసల యనంగ
దయకు నీరెం డభిధానంబు లయ్యెను
గనికర మనఁగ నక్కటిక మనఁగ
బాల్యస్థునకుఁ బేళ్లు పరిఢవిల్లును బిన్న
వాఁ డనఁ గొండుకవాఁ డనంగ
తే. సంధ్య కాఖ్యలు మునిమాపు సంజ యనఁగ
జూద మన నెత్త మనఁగ దురోదరంబు
జడి యనఁగ వాన యనఁగ వర్షంబు పేళ్లు
నోలి యుంకువ యన శుల్క మొప్పు నభవ. 51

టీ. ఉగ్రాణము, బొక్కసము- ౨=ధనముండెడిగృహము. హజారము, ॥పా॥ హాజారము, మోసల-౩=ఆస్థానమంటపము. కనికరము, అక్కటికము ౨=దయ. పిన్నవాఁడు, కొండుకవాఁడు-౨=బాల్యస్థుఁడు. మునిమాపు,సంజ-౨=సంధ్యాకాలము. జూదము, నెత్తము-౨=ద్యూతము. జడి, వాన-౨=వర్షము. ఓలి, ఉంకువ-౨=శుల్కము.

సీ. పయ్యెద యనఁగను బైఁట యనంగ సం
వ్యానంబునకు నాఖ్య లై తనర్చు
నొక్కపెట్ట ననంగ నువ్వెత్తుగ ననంగ
యుగపత్పదంబున కొప్పుఁ బేళ్లు
కవఱ లనం బాచిక లనంగ నక్షముల్
బన్న మొచ్చె మనంగఁ బరిభవంబు
వ్యాపార మగుఁ జెయ్ద మనఁ జెయ్దు యనఁగను
గన్నఁ గీ లనఁ గపటచేష్ట
తే. కందుకము బంతి చెం డనఁగను దనర్చు

నఱవఱలు చిద్రుప లన ఖంఽడాహ్వయములు
కాఁచువడియంబు లనఁగను ఽ కైరవళ్ల
నంగ ఖాదిరఘుటిక లఽనంగదమన. 52

టీ. పయ్యెద, పైఁట-ఇ=ఉత్తరీయము. ఒకపెట్ట, ఉవ్వెత్తుగ-ఇ=ఒకసారిగ. కవఱలు, పాచికలు-ఇ-అక్షములు. బన్నము (ప్ర. భంగము)-ఒచ్చెము-ఇ=తిరస్కారము. చెయ్దము, చెయ్ది-ఇ=వ్యాపారము. కన్ను, కీలు-ఇకపటచేష్ట. బంతి, చెండు-ఇ=కందుకము. అఱవఱలు, చిద్రుపలు, ఇ-ఖండములు(తునుకలు). కాఁచువడియములు, కైరవళ్లు-ఇ=ఖాదిరఘుటికలు

సీ. మాగాని రాజ్యంబు ఽ మణియ ముద్యోగంబు
చిట్టలు చిత్రముల్ ఽ చిలుకు శరము
ఎత్తికోలు ప్రయత్న ఽ మీలువు మానంబు
బారి యనంగ నుఽపద్రవంబు
విన్నను వనఁగఁ బ్రాఽవీణ్యం బెలర్చును
దార్కాణ మనఁగ నిఽదర్శనంబు
నిట్టపంట యనంగ ఽ నిష్కారణం బంట
బానసం బనఁగ మఽహానసంబు
తే. నామ మేకాంతమునకు మంఽతన మనంగ
నంతిపుర మన శుద్ధాంత ఽ. మలరుచుండు
నుదిరి యనఁ దప్తకాంచన ఽ మొప్పుచుండుఁ
దివురుట యభిలషించుట ఽ దేవదేవ. 53

టీ. మాగాని=దేశము. మణియము=ఉద్యోగము, చిట్ట=ఆశ్చర్యము. చిలుకు=బాణము. ఎత్తికోలు=ప్రయత్నము. ఈలువు = పాతివ్రత్యము. బారి=ఉపద్రవము. విన్ననువు=ప్రావీణ్యము-నేర్పు. దార్కాణము=నిదర్శనము. నిట్టపంట=నిష్కారణము. బానసము=వంటయిల్లు. మంతనము=ఏకాం

తము. అంతిపురము=అంతఃపురము. ఉదిరి=అపరంజి. తివురుట=కోరుట.

సీ. బిట్టు గ ట్టనఁ బెల్లు పెద్దయుఁ దద్దయు
నురవడి పరువడి యుద్దవిడియుఁ
బనివడి పదపడి బలువిడి తలకొని
నెట్టన యెంతేని నెఱి కరంబు
లలి వార కేడ్తెఱ పెలుచ వావిరి యన
నఱిముఱి యనఁ బోరిఁబోరి యనంగఁ
గడుఁ జాల మిగులంగ గాటంబ నంగ న
త్యంతముగ ననుట కాఖ్య లయ్యె
తే. నుడుకు సెక వెట్ట వేఁడిమి యుబ్బ యావి
యుక్క యన నొప్పు నామంబు లుష్ణమునకుఁ
దాల్మి యోరిమి సైరణ తాళుకొంట
సైఁచు టోర్చుట యనఁగను క్షాంతిపేళ్లు. 54

టీ. బిట్టు, గట్టి, పెల్లు, పెద్దయున్, తద్దయున్, ఉరవడి, పరువడి, ఉద్దవిడి, ॥పా॥ ఉద్దవడి, పనివడి, పదపడి, బలువిడి, తలకొని, నెట్టన, ఎంతేని, నెఱి, కరము, లలి, వారక, ఏడ్తెఱ, పెలుచ, వావిరి, అఱిముఱి, పోరిఁబోరి, కడున్, చాలన్, మిగులన్, గాటము-౨౭=అత్యంతము. ఉడుకు, సెక, వెట్ట, వేఁడిమి, ఉబ్బ, ఆవి, ఉక్క-౭=ఉష్ణము. తాల్మి, ఓరిమి, సైరణ, తాళుకొంట, సైఁచుట, ఓర్చుట-౬=క్షాంతి.

తే. పెద్దనిద్దురఁ జెందించెఁ బిలుకుమార్చె
గీటణంచెను గుదెతాల్పువీటి కనిచెఁ
గూలిచెను రూపుమాపెను నేలఁ గలిపె
ననఁగ హతిచేసె ననుట కాఖ్యలు దనర్చు. 55

టీ. పెద్దనిద్దురఁజెందించెను, పిలుకుమార్చెను, గీటణంచెను, గుదెతాల్పు, వీటికనిచెను=యమపురికిపంపెను, కూలిచెను, రూపుమాపెను, నేలఁగలిపెను

౩=హతిచేసెను-అనఁగా చంపెను.

క. పరిచూర్ణ మయ్యె ననుటకు
వరుసన్ నామంబు లగుచు ♦ వర్తిలుచుండున్
దుఱు మయ్యెం బరు మయ్యెన్
నుఱు మయ్యెన్ బిండి యయ్యె ♦ నుగ్గయ్యె ననన్. 56

టీ. తుఱుమయ్యెను, పరుమయ్యెను, నుఱుమయ్యెను, పిండియయ్యెను, నుగ్గయ్యెను-౫=చూర్ణమయ్యెను.

క. కునికె నిదురించెఁ గూర్కెను
గనుమోడ్చె ననంగ నిద్రగనుటకుఁ బేళ్లౌఁ
గనువిచ్చె ననఁగ మేల్కనె
ననఁగఁ బ్రబోధంబు నొందె ♦ ననుటకుఁ బేళ్లౌ. 57

టీ. కునికెను, నిదురించెను, కూర్కెను, కనుమోడ్చెను - ౪=నిద్రగనెను. కనువిచ్చెను, మేల్కనెను - ౨=ప్రబోధమునొందెను.

క. డులిచె వదలించె నూడ్చెను
దొలఁగించెను బాపె ననఁగఁ ♦ ద్రోచె ననంగా
వెలికొత్తె ననఁగఁ బేళ్లై
యలరున్ విఘటన మొనర్చె ♦ ననుటకు శర్వా. 58

టీ. డులిచెను, వదలించెను, ఊడ్చెను, తొలఁగించెను, పాపెను, త్రోచెను, వెలికొత్తెను - ౭=విఘటన మొనర్చెను.

క. పొలయలుక యనఁగ నెయ్యపు
టలుక యనం బ్రణయకలహ ♦ మలరారుఁ గుచం
బుల కొప్పు నామములు గు
బ్బ లనంగాఁ జన్ను లనఁగఁ ♦ బాలిండ్లనఁగన్. 59

టీ. పొలయలుక, నెయ్యపుటలుక-౨=ప్రణయకలహము. గుబ్బలు,

చన్నులు, పాలిండ్లు=(పాలు+ఇండ్లు)-3=కుచములు.

తే. చాటిమున్నీ రనఁగ నుప్పుసంద్ర మనఁగ
రాజిలుచు నుండు లవణవారాశి పేళ్లు
కాలు వన బట్టె యనఁగను జా లనంగఁ
గుల్య కభిధాన మై పొల్చుఁ గుధరనిలయ. 60

టీ. చాటిమున్నీరు, ఉప్పుసంద్రము-౨=లవణసముద్రము. కాలువ, బట్టె, జాలు-3=కుల్య.

తే. పెల్లగించెను పెకలించెఁ బెఱికె ననఁగ
నాఖ్య లుత్పాటన మొనర్చె ననుట కలరు
నాహ్వయంబులు ఛేదించె ననుట కయ్యెఁ
జించె నన వ్రచ్చె నన వ్రక్కలించె ననఁగ. 61

టీ. పెల్లగించెను, పెకలించెను, పెఱికెను-3=ఉత్పాటన మొనర్చెను. చించెను, వ్రచ్చెను, వ్రక్కలించెను-3=ఛేదించెను.

తే. కనుమొఱఁగె నేమఱించె నాఁగను నిగూఢ
వర్తన మొనర్చె ననుట కాహ్వయము లమరు
మొయి లన మొగు ళ్లనంగను మొనయు మబ్బు
లన ఘనంబుల కాఖ్య లై యభ్రకేశ. 62

టీ. కనుమొఱఁగెను, ఏమఱించెను-౨=నిగూఢవర్తనము చేసెను. మొయిలు, మొగుళ్లు, మబ్బులు-3=మేఘములు.

క. పగ ఱనఁగ మార్తు రనఁగను
బగవాండ్రనఁ బగతు రనఁగఁ బరిపంథికిఁ బే
ళ్లగు మెగ మనంగ మెక మన
మృగమునకు నభిఖ్య లయ్యె మేరుశరాసా. 63

టీ. పగఱు, మార్తురు, పగవాండ్రు, పగతురు-౪=విరోధి. మెగము, మెకము-౨=మృగము.

తే. ఇంకె నడుగంటె వట్టె నా § నివిరె ననఁగ
నిర్జలం బయ్యె ననుటకు § నెగడుఁ బేళ్లు
నిండెఁ గ్రిక్కిఱిసె ననఁ బూ § ర్ణించె ననుట
కాఖ్యలై తనరారు సు § ధాంశుమకుట. 64

టీ. ఇంకెను, అడుగంటెను, వట్టెను, ఇవిరెను-౪=నిర్జలమయ్యెను. నిండెను, క్రిక్కిఱిసెను-౨=పూర్ణించెను.

తే. పెచ్చుపెరిఁగె ననం బురి § విచ్చె మీఱె
నన విజృంభించె ననుటకు § నాఖ్య లయ్యెఁ
దిండికాఁ డనఁ దిండీఁడు § తిండిపో త
నంగ భక్షకునకును ద § నర్చుఁ బేళ్లు. 65

టీ. పెచ్చుపెరిఁగెను, పురివిచ్చెను, మీఱెను-౩=విజృంభించెను. తిండికాఁడు, తిండీఁడు, తిండిపోతు-౩=భక్షకుఁడు.

క. పెనఁగొనె గిఱిగొనియెను వల
గొనియె మెలిగొనియెఁ జుట్టు § కొనె సుడిగొనె నాఁ
గను నులిగొనె నన నాఖ్య ల
గును వలయిత మయ్యె ననుట § కును శితికంఠా. 66

టీ. పెనఁగొనెను, గిఱిగొనెను, వలగొనెను, మెలికొనెను, చుట్టుకొనెను, సుడిగొనెను, నులిగొనెను-౭=వలయిత మయ్యెను.

సీ. మొగరా లనఁగ స్తంభ § ములు చిట్టకము దంభ
మెరగలి వసవహ్ని § మెడ్డె మూర్ఖుఁ
డుడుగర యుపహార § మూఱట విశ్రాంతి
మొదల లని యనఁగను § మూల మనుట
తఱు లన వళులు చిం § దమనంగ శంఖంబు
తఱటనంగఁ గశాభి § ధాన మయ్యెఁ

దమ టనఁ గీల పఱదం బగు మెట్టన
    గాయకులకుఁ బేరు గాణ లనఁగ
తే. మృత్యువునకును బేరయ్యె మిత్తి యనఁగ
మకుటమున కాఖ్య యగు బొమిడిక మనంగ
నోముట యనంగఁ బోషించు టూడిగంబు
సేవ కభిధాన మై యొప్పు షభూష. 67

టీ. మొంగరాలు=స్తంభములు. చిట్టకము = దంభము (లేక) మిష. ఎరగలి,॥పా॥ఎరపలి-తి=వనవహ్ని, ఎడ్డె=మూర్ఖుఁడు. ఉడుగర=కానుక (లేక) బహుమానము. ఊఱట=విశ్రాంతి. మొదలు=మూలము. తఱులు=వళులు (అనఁగా కడుపుమీఁది ముడుతలు). చిందము=శంఖము. తఱటు=కశ (గుఱ్ఱమును శిక్షించు చబుకు). తమట=అగ్నిజ్వాల. మెట్ట=పాదము. గాణలు=గాయకులు. మిత్తి=మృత్యువు. బొమిడికము=కిరీటము. ఓముట=పోషించుట. ఊడిగము=సేవ.

సీ. ఎట్టకేల కనంగ నెనయును సకృదర్థ
    మఖిలం బటంటకు నంతవట్టు
ఏకాకి యొక్కటి కేకులు పలువురు
    వేనవేల్ పెక్కండ్రు వేవు రనఁగ
నలరు నోచేదర్థ మై కానినాఁ డన
    నేతాదృశులె యంట కిట్టివారె
మిన్నక యూరక మున్నఁ దూష్ణీమర్థ
    మనుసరించి యటంట కగును దొట్టి
తే. యొండొకఁ డనంగ మఱియు వేఱొకఁడు లాఁతి
వాఁడు వెఱవాఁడు తక్కినవాఁ డనఁగ
నన్యునకు నాఖ్య లగుచుఁ బెంపారు చుండు

శయఘటితశూలు వైయాఘ్రకచర్మచేల. 68

టీ. ఎట్టకేలకున్ = ఒకానొకప్పుడు. అంతవట్టు = అఖిలము. ఎక్కటి = ఏకాకి. పలువురు, వేనవేలు, పెక్కండ్రు, వేవురు-౪ = అనేకులు. కానివాఁడు = అటుకాకపోయిన, ఇట్టివారె = ఏతాదృశులె-ఈలాటివారేయనుట. మిన్నక, ఊరక-౨ = తూష్ణీమర్థకములు. తోట్టి = అనుసరించి. ఒండొకఁడు, వేఱొకఁడు, లాఁతివాఁడు, పెఱవాఁడు, తక్కినవాఁడు-౫ = అన్యుఁడు.

## నా నా ర్థ ము లు.

క. వడి యనఁగాఁ గాలం బగు
వడి యన వేగంబునకును వర్తిలుఁ బేరై
మడి యనఁ గేదారం బగు
మడి యనఁగా శుద్ధికిని సమాహ్వాయ మయ్యెన్. 69

టీ. వడి=కాలము, వేగము. మడి=వరిచేను, శుద్ధి.

క. ఈ డనఁగ వయసుపే రగు
నీ డన సామ్యంబునకును నెనఁగును బేరై
నా డన రాజ్యముపే రగు
నాఁ డనఁ దత్కాలమం దనఁగఁ బెంపారున్. 70

టీ. ఈడు=వయస్సు, సామ్యము. నాడు = రాజ్యము. నాఁడు = తత్కాలమందు.

క. మొన యన సైన్యముపే రగు
మొన యనఁగా నగ్రభాగమునకును బే రా
దొన యనఁ దూణీరం బగు
దొన యన నవసానమునకుఁ దొడరును బేరై. 71

టీ. మొన=సైన్యము, అగ్రభాగము. దొన=అమ్ములపొది, అంతము.

. వెన్ననఁగ బీజమంజరి

వెన్నన( జరమాంగమునకు । వెలయును బేరై
కన్నులనం బర్వంబులు
కన్నులనఁ లోచనములు । కంఠేకాలా. 72

టీ. వెన్ను = సస్యములవెన్ను (అనఁగా కంకి), వీఁపు. కన్నులు = కణుపులు, నేత్రములు.

క. తమ్మి యనఁ దరువిశేషము
తమ్మి యనం బంకజాభిధానం బయ్యెన్
నెమ్మి యనఁ బ్రియము పేరగు
నెమ్మి యన మయూరమునకు । నెగడుం బేరై. 73

టీ. తమ్మి = వృక్షవిశేషము, తామర. నెమ్మి = ప్రియము, నెమిలి.

క. దండ యనన్ సాన్నిధ్యము
దండన సుమమాలికాభిధానం బయ్యెన్
మండనఁ బ్రకోష్ఠ మయ్యెన్
మండన మృత్పాత్రకును స్సమాహ్వయ మయ్యెన్. 74

టీ. దండ = సాన్నిధ్యము, పుష్పమాలిక. మండ = ప్రకోష్ఠము, మృత్పాత్రము (అనఁగా మంటికుండ.)

క. తెలుఁగుంగబ్బపువర్ణము
తెలుఁగుకవీంద్రులకుఁ దేటతెల్లము గాఁగం
దెలియఁగ నడిదము సూరయ
చెలువారఁగ నాంధ్రనామశేషముఁ జెప్పెన్. 75

సటీకాంధ్రనామశేషము

సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.

# సాం బ ని ఘం టు వు.

---

స టీ క ము.

అవతారిక:—కస్తూరిరంగకవి యనునతఁ డీ నిఘంటువును శ్రీసాంబమూర్తి కంకితము సేయువాఁడై మొదటదీనిని రచించు పద్ధతిని దెలుపుచున్నాఁడు.

సీ. శ్రీ వెలయంగ దేశీయముల్ దెనుఁగులుఁ
దద్భవంబులుఁ గూర్చి దైవవర్గ
దనరు మానవవర్గ స్థావరవర్గ తి
ర్యగ్వర్గ సనునాలు గలవరించి
జల్లు లుంపక వ్యర్థశబ్దముల్ రానీక
కుంటినడత గాక కొదుకు లేక
యుర్వీజనంబుల కుపకారసరణిగా
నాంధ్రనామనిఘంటు వనెడుకృతిని

తే. గవులదయచేత నీకటాక్షంబువలన
నీసకతకంబుఁ జెప్పెదఁ జిత్తగింపు
దనుజసమవర్తి భక్తహృద్భవర్తి
సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి. 1

టీ. ఓ సాంబమూర్తీ! ఈ యాంధ్రభాషయందుఁ గలయన్యదేశ్యములును త్రిలింగదేశ్యములును సంస్కృత ప్రాకృతభవములును గూర్చి,

వానిని దేవవర్గు మానవవర్గు స్థావరవర్గు తిర్యగ్వర్గు అను నాలుగువర్గులనుగా విభజించి, సరికానిశబ్దములనుగాని వ్యర్థశబ్దములనుగాని పెట్టక వర్ణలోపములు గలపదములను రానీక సరళశైలితో 'ఆంధ్రనామనిఘంటువు' అను నీగ్రంథమును మహాకవులకృపచేతను నీయనుగ్రహముచేతను నీసశతకముగా రచించుచున్నాను. దీనిని జిత్తగింపుమా!

సీ. ముక్కంటితొలిపట్టి ♦ మొట్టికాయలమెప్పు
గొప్పబొజ్జగలాఁడు ♦ గుజ్జువేల్పు
గబ్బుచెక్కిళ్లమెకెకముమోము గలసామి
కలుఁగులాయపుఁదేజిబలుసిపాయి
గుంజిళ్లు పెట్టించుకొను మేటి పిళ్లారి
కుడుముదాలుపు పెద్దకడుపువేలు
పొంటిపల్లుదొర ముక్కంటిపండుల మెక్కు
దేవర చిలువజంకెదెములమేటి

తే. జమిడితల్లులబిడ్డ పెద్దమెయిప్రోడ
చేటవీనులదణి పనిచెలుపువాఁడు
మొదటివేలుపు వెనకయ్య ♦ పుంజుదారి
పెద్ద యనఁ దగు గణపతిపేళ్లు సాంబ. 2

టీ. ముక్కంటితొలిపట్టి=శివునిమొదటిబిడ్డ, మొట్టికాయలమెప్పు=భక్తులువేసికొను మొట్టికాయలకు మెచ్చుకొనువాఁడు, గొప్పబొజ్జగలాఁడు=పెద్దబొజ్జగలవాఁడు, గుజ్జువేల్పు=పొట్టిదేవుఁడు, గబ్బు...సామి=(మదగంధముల చెక్కిళ్లుగలిగియున్న మృగముయొక్క అనఁగా) ఏనుఁగుయొక్క ముఖముగలదేవుఁడు, కలుఁగు...సిపాయి = బొక్కలు లాయముగాఁ గల గుఱ్ఱములు (అనఁగా ఎలుకలు) వాహనముగాఁ గల గొప్పవీరుఁడును, గుంజిళ్లుపెట్టించుకొనుమేటి = భక్తులచే గుంజిళ్లు పెట్టించుకొనుదొర, పిళ్లారి,

కుడుముదాలుపు=కుడుములను చేత ధరించియున్నవాఁడు, పెద్ద...వేలుపు=గొప్పకడుపుగలదేవుఁడు, ఒంటిపల్లుదొర=ఒకదంతముగలయేలిక - ఏకదంతుఁడు, ముక్కంటి...దేవర=టెంకాయలనుభక్షించుదేవుఁడు, చిలువ...మేటి=సర్పములు యజ్ఞోపవీతములుగాఁగలదొర, జమిడి ..బిడ్డ = ఇద్దఱు తల్లుల (అనఁగా గంగాపార్వతుల) బిడ్డ, పెద్దమెయిప్రోడ=గొప్పదేహము గలదిట్ట, చేటవీనులదణి=(గజముఖుఁడు గనుక) చేటలవంటి చెవులుగల దొర, పని...వాఁడు=విఘ్నములకు రాజు, మొదటివేలుపు = మొదటఁబూజింపఁబడుదేవుఁడు, వెనకయ్య, పుంజుదారి పెద్ద=కుక్కుటమును ధ్వజమందుధరించిన కుమారస్వామికి అన్నయైనవాఁడు - అం=వినాయకుఁడు.

సీ. చౌవంచమోములఽ సాహేబు జాళువా
గుబ్బలివిలుకాఁడు ఽ గిబ్బరౌతు
జక్కులదొరనేస్తి ఽ జన్నంపుఁబగవాఁడు
పొడలగిఁటముదాల్పు ఽ పునుకదారి
వినువాఁకమోపరి ఽ వెండికొండదునీఁడు
మినుజుట్టుదేవర ఽ మిత్తిమిత్తి
మంచుమలల్లుఁడు ఽ మరుగొంగ ముక్కంటి
నెలదారి ముమ్మొనఽయలుఁగుమేటి

తే. విసపుమేఁతరి తిగప్రోలిఽవేఁటకాఁడు
కప్పులైదువపెనిమిటి ఽ గాములదొర
వేల్పుదణిఁ గన్నతఁడు గుజ్జుఽవేల్పుతండ్రి
బేసికన్సామి యన నీదుఽపేళ్లు సాంబ. 3

టీ. చౌవంచ...సాహేబు=(౪ + ౧)ఐదుముఖములుగలమేటి, జాళువా...విలుకాఁడు=బంగారుకొండ (అనఁగా మేరుపర్వతము) విల్లుగాఁ గలవాఁడు, గిబ్బరౌతు=ఎద్దువాహనముగాఁ గలవాఁడు, జక్కులు...నేస్తి=

యక్షులరాజగు కుబేరునికి స్నేహితుఁడు, జన్నంపుఁబగవాఁడు=దక్షయజ్ఞము నకువిరోధియైనవాఁడు, పొడల...దాల్పు=మచ్చలు గలజంటపోగువస్త్రము (అనఁగా పులితోలును) ధరించినవాఁడు, పునుకదారి = కపాలమును ధరించినవాఁడు, వినువాఁకమోపరి=ఆకాశపునదియగు గంగను దలయందు వహించినవాఁడు, వెండికొండదునీఁడు=కైలాసపర్వతమువాసస్థానముగాఁగల సరదారు, మినుజొట్టుదేవర=ఆకాశము సిగగాఁగలదేవుఁడు, మిత్తిమిత్తి = మృత్యువును సంహరించినవాఁడు, మంచుమలల్లుఁడు = హిమవత్పర్వతము నకునల్లుఁడు, మరుగొంగ=మన్మథునకుశత్రువు, ముక్కంటి=మూఁడుకన్నులు గలవాఁడు, నెలదారి=చంద్రునిశిరస్సునందు ధరించినవాఁడు, ముమ్మొన .. మేటి = మూఁడుమొనలు గలత్రిశూలమనునాయుధముగలదొర, విసపుమేఁతరి=హాలాహలమను విషమును భక్షించినవాఁడు, తిగ...కాఁడు=త్రిపురములను వేఁటాడినవాఁడు, కప్పు...పెనిమిటి=నల్లనివర్ణముగల స్త్రీకి (పార్వతికి) భర్తయైనవాఁడు, గాములదొర=భూతములకు రాజు, వేల్పుదణిఁగన్నతఁడు=దేవతలసేనాధిపతియగు కుమారస్వామిని గన్నట్టివాఁడు, గుజ్జు... తండ్రి =వినాయకునితండ్రి, జేసికన్నామి = (జేసిసంఖ్యయగు) మూఁడు కన్నులుగలదేవుఁడు-ఇవి=శివుఁడు.

సీ. వెన్నుఁడు పెరుమాళ్లు ॥ వేగంటిసైదోడు
కవ్వపుమలదాల్పు ॥ కట్టినేస్తి
చిలువపానుపుదంట ॥ తెలిదీవిమన్నీఁడు
బటువుఁగైదువుజోదు ॥ బమ్మతండ్రి
కతివేల్పు మరునయ్య ॥ కడలియల్లుఁడు సంకు
దారి గరుడిరౌతు ॥ తమ్మికంటి
పదివేసములదిట్ట ॥ యెదమచ్చ గలసామి
యదుగువాఁకగిలాఁడు ॥ పుడమినంటు
తే. మొసలివాయొంట్లతాల్పు రక్కసులగొంగ
లచ్చిమగఁ డుడ్డకేలుగిరిలాఁడు పుట్టు

వడుగు తామరపొక్కిలిఽవాఁడు పసిఁడి
వలువతాల్పన హరిపేరు ఽలలరు సాంబ. 4

టీ. వెన్నుఁడు (ప్ర. విష్ణుఁడు), పెరుమాళ్లు (ఇదియఱవపదము), వేగంటిసైదోడు=(వామనావతారమున) వేయికన్నులు గలయింద్రునికిఁదోఁబుట్టువైనవాఁడు - ఉపేంద్రుఁడు, కప్పపు...తాల్పు = మందరపర్వతమును (కూర్మావతారమున) ధరించినవాఁడు. కత్తినేస్తి=అర్జునునిచెలికాఁడు, చిలువ...దంట=సర్పము (అనఁగా ఆదిశేషుఁడు) శయ్యగాఁగలనేర్పరి, తెలి...మన్నీఁడు=శ్వేతద్వీపము వాసస్థానముగాఁగలప్రభువు, బటువు...జోదు=గుండ్రని చక్రాయుధమును దాల్చినయోధుఁడు, బమ్మతండ్రి=బ్రహ్మకుతండ్రి, కటివేల్పు=నల్లనిదేవుఁడు, మరునయ్య = మన్మథునితండ్రి, కడలియల్లుఁడు=పాలసముద్రునికి అల్లుఁడైనవాఁడు, సంకుదారి=శంఖమును ధరించినవాఁడు, గరుడిరౌతు=గరుత్మంతు నెక్కి తిరుఁగువాఁడు, తమ్మికంటి=తామరలవంటి కన్నులుగలవాఁడు, పది...దిట్ట = దశావతారములనెత్తిననేర్పరి, ఎద...సామి=ఱొమ్మునందు శ్రీవత్సమనుపుట్టుమచ్చగలదేవుఁడు, అడుగు...గలాఁడు, =పాదమునందు గంగానదిగలవాఁడు (గంగ యతనిపాదములందుఁబుట్టినదని యర్థము), పుడమినంటు = భూదేవికిస్నేహితుఁడు (అనఁగా ప్రియుఁడు), మొసలి...తాల్పు=మొసలినోటివలెనుండు పోఁగులను (అనఁగా మకరకుండలములను) ధరించినవాఁడు, రక్కసులగొంగ = రాక్షసులకుశత్రువు, లచ్చిమగఁడు = లక్ష్మీదేవి పెనిమిటి, ఉద్ద...గలాఁడు = నాలుగుచేతులు గలవాఁడు-చతుర్భుజుఁడు, పుట్టువడుగు=నిత్యబ్రహ్మచారి, తామర...వాఁడు=తామరపువ్వు నాభియందుఁ గలవాఁడు-పద్మనాభుఁడు, పసిఁడి...తాల్పు=బంగారువస్త్రమును ధరించువాఁడు - ౨౬=విష్ణుదేవుఁడు.

సీ. తీవంచమోములఽదిట్ట తామరచూలి
తలఁపుకేళాకూళిఽపులుఁగురౌతు
తగవులజడదారిఽతండ్రి వేలుపుఁబెద్ద

మాటలజవరాలికిమగఁడు నలువ
యలరులవిలుకానికియన్న మేలిమిబొజ్జ
గలదుముదారి ప్రాఁకిబలుకులదణి
నుదురాకులెక్కఁ జేసున్నగ వ్రాయుకరణీకుఁ
డచ్చంపుఁదమ్మిపైఁ గినమరుజాణ
తే. నిక్కపుజగంబుఁ బ్రోచుమకన్నీఁడు మొదటి
జాతిదొర బమ్మ దుగినఁడు తాత జగము
లన్నిపుట్టించుమేటి తనంతఁ గల్గు
నతఁడు పజదొర యన నజాకిఖ్య లగు సాంబ. 5

టీ. తీవంచ...దిట్ట=(3+౧) నాలుగుముఖములు గల ప్రోడ, తామ రచూలి=తామరపువ్వునందుఁ బుట్టినవాఁడు, తలఁపు...రౌతు=మానససర స్సుపతులగుహంసలు వాహనముగాఁ గలవాఁడు, తగవుల...తండ్రి=కలహ ప్రియుఁడగు నారదముని తండ్రి, వెలుపుఁబెద్ద=దేవతలలో శ్రేష్ఠుఁడైన వాఁడు మాటల...మగఁడు=సరస్వతికిఁ బెనిమిటి, నలువ=నాలుగునోళ్లు గలవాఁడు, అలరు...యన్న=మన్మథునికి అన్నయైనవాఁడు, మేలిమి... దారి=బంగారుమయమైనకడుపు గలసరదారు - హిరణ్యగర్భుఁడు, ప్రాఁ బలుకులదణి=వేదములకధిపతి, నుదురాకు...కరణీకుఁడు=నొసళ్లనెడు తా టాకులలో ఆయుస్సులలెక్కలను జక్కఁగా వ్రాయునట్టికరణము - నొస ళ్లయందు ఆయుఃప్రమాణములను వ్రాయునట్టివాఁడనియర్థము. అచ్చంపు.. జాణ=తెల్లనితామరపువ్వు (అనెడు సింహాసనము) మీఁదఁ గూర్చుండునట్టి నేర్పరి, నిక్కపు...మన్నీఁడు=సత్యలోకమును పాలించుప్రభువు, మొదటి ...దొర = బ్రాహ్మణజాతికి నధిపతియైనవాఁడు, బమ్మ = (ప్ర) బ్రహ్మ, దుగినఁడు (ప్ర. ద్రుహిణుఁడు), తాత=పితామహుఁడు, జగము...మేటి= లోకములనెల్లసృజించునట్టి ఘనుఁడు, తనంత...నతఁడు=తనంతటఁదానె పుట్టినట్టివాఁడు-స్వయంభువు, పజదొర=ప్రజాపతి - ౨౦=బ్రహ్మ.

సీ. గట్టురాకొమరిత | కప్పుముత్తైదువ
మగనియందపుమేనఁ | దగినమగువ
కలకంఠురాణి సిం | గపుఁదేజిగలచాన
వెనకయ్యతల్లి నా | వెలయు గౌరి
కలుములచెలి జిడ్డుఁ | గడలిబొట్టియ లచ్చి
తమ్మిగద్దియబోటి | తల్లితల్లి
పెనిమిటియెద నుండు | ననఁబోఁడి మరుతల్లి
నెలచెలియలు లిబ్బి | నెలఁతుక సిరి.

తే. యనఁగ లక్ష్మీసమాఖ్య లౌ | నంచతేజి
పొలఁతి తలనాకిటమెలంగు | చెలువ నలువ
రాణి పలుకులజవరాలు | లచ్చికోడ
లనఁగ భారతినామంబు | లమరు సాంబ. 6

టీ. గట్టు రాకొమరిత=పర్వతరాజగుహిమవంతునికూఁతురు, కప్పుముత్తైదువ=నల్లని శరీరచ్ఛాయ గలవృద్ధసువాసిని, మగని...మగువ=భర్తయగుశివునిసుందరశరీరమునందు సగభాగముగానొప్పియుండెడు స్త్రీ, కలకంఠురాణి=శివునిపత్ని, సింగపు...చాన=సింహవాహనము గల స్త్రీ, వెనకయ్యతల్లి=వినాయకునితల్లి-ఉ=పార్వతి. కలుములచెలి=సంపదల కధిదేవతయగు స్త్రీ, జిడ్డు...బొట్టియ=పాలసముద్రపుకూఁతురు, లచ్చి=(ప్ర) లక్ష్మి, తమ్మి...బోటి=పద్మసింహాసనముగల స్త్రీ, తల్లితల్లి=తనతల్లియైనగంగకుఁ దాను దల్లియైనది, పెనిమిటి...బోఁడి-మగనివక్షమునందు వసించు స్త్రీ, మరుతల్లి=మన్మథునితల్లి, నెలచెలియలు=చంద్రునిచెల్లెలు (ఇరువురును సముద్రమునం బుట్టినవా రగుటచే నిట్లుచెప్పఁబడినది), లిబ్బినెలఁతుక=ధననిక్షేపముల యందుండు స్త్రీ, సిరి=(ప్ర) శ్రీ-౧౦=లక్ష్మి. అంచతేజిపొలఁతి = హంస వాహనముగల స్త్రీ, తల...చెలువ = నోటియందుసంచరించు స్త్రీ, నలువ

రాణి=బ్రహ్మభార్య, పలుకులజవరాలు=వాక్కులకు (అనఁగా విద్యలకు)అధి దేవత యగు స్త్రీ), లచ్చికోడలు=లక్ష్మీదేవికోడలు - శ=సరస్వతి.

సీ. అడుగుకైదువుపుల్గు • పడగదు నేదారి
యఱబారతల్లుల • యరిదిబిడ్డ
వెనకయ్యవెనుకయ్య • వేల్పులదళవాయి
చిలువలబోనంపుఁ • బులుఁగురౌతు
సత్తిఁ బూనువలంతి • యిత్తిగమోముల
బలియుఁడు బారచే • తులు గలాఁడు
రిక్కరక్కసుమిత్తి • తెల్లుకానుపు కొంచ
మల ప్రక్కలించిన • మన్నెకాఁడు
తే. గట్లయేలికమనుమఁడు • కప్పతెఱవ
మేటికొమరుఁడు వేలుపు • టేటిసవతి
కొడుకు ముద్దయ్య కందుఁడు • కొమరుసామి
యనఁగ గుహనామధేయంబు • లమరు సాంబ. 7

టీ.అడుగు...దునేదారి=(పాదములే ఆయుధముగాఁగల పక్షియగు) పుంజుకోడి ధ్వజమునందుఁ గల సరదారు, అర...బిడ్డ = ఆఱుతల్లుల(అనఁగా షట్కృత్తికల] ఆబ్బురపుబిడ్డ, వెనకయ్యవెనుకయ్య=వినాయకునికి వెనుకఁ బుట్టినవాఁడు, వేల్పుల దళవాయి=దేవతల సేనాధిపతి, చిలువల...రౌతు=(సర్పములను భుజించుపక్షియగు) నెమలినెక్కితిరుగువాఁడు, సత్తి...వలంతి=శక్తియనునాయుధమును ధరించిన నేర్పరి, ఇత్తిగ...బలియుండు=(౩+3) ఆఱుముఖములుగల బలవంతుఁడు, బార ..గలాఁడు=పండ్రెండుచేతులు గలవాఁడు, రిక్క...మిత్తి=చుక్క యను పేరుగలరాక్షసుని (అనఁగా తారకాసురుని)చంపినవాఁడు, తెల్లుకానుపు=తెల్లునందుఁబుట్టినవాఁడు, కొంచ...మన్నెకాఁడు=క్రౌంచపర్వతమును భేదించిన ప్రభువు,

గట్ల...మనుమఁడు=పర్వతరాజగుహిమవంతునికిఁ బౌత్రుఁడు, కప్ప... కొమరుఁడు=పార్వతి గొప్పకొడుకు, వేల్పు ..కొడుకు = దేవతానదియగు గంగకుసవతియగు పార్వతికుమారుఁడు, ముద్దయ్య, కందుఁడు=(ప్ర) స్కంధుఁడు. కొమరుసామి=(ప్ర) కుమారస్వామి-౧౭=కుమారస్వామి.

సీ. తలఁపుచూలి మరుండు ♦ వలఱేఁడు చిలుకరౌ
 తామనిచెలి గాడ్పుకొటరదపుదొర
జాబిల్లియల్లుఁడు ♦ చౌవంచతూపుల
 నెఱదంట కలుములకొగరితబిడ్డ
కన్నులవిల్తుఁడు ♦ కమ్మవిల్తుఁడు పచ్చ
 విలుకాఁడు చక్కెరకొవింటిజోదు
వెడవిలుతుఁడు తియ్యకొవిల్తుఁడు చిగురాకు
 విలుకాఁడు తుంటవిల్ ♦ గల దునీఁడు
తే. తలిరువిల్తుఁడు ననవిల్తుఁ ♦ డలరువిల్తుఁ
డించువిల్కాఁడు రాచిల్క ♦ నెక్కు రౌతు
మీను మొసలిసిడెంబులకొమేటి తేఁటి
యల్లెవాఁ డన మదనాఖ్య ♦ లమరు సాంబ. 8

టీ. తలఁపు చూలి=తలంపునందుఁబుట్టువాఁడు-సంకల్పసంభవుఁడు, మరుఁడు(ప్ర. స్మరుఁడు), వలఱేఁడు=కామములకురాజు, చిలుకరౌతు=చిలుకనెక్కితిరుగువాఁడు, ఆమనిచెలి=వసంతర్తువునకుచెలికాఁడు, గాడ్పు...దొర=గాలియే తేరుగాఁగలప్రభువు, జాబిల్లియల్లుఁడు=చంద్రునికల్లుఁడు, చౌ...దంట=(౪+౧) ఐదుబాణములు గలమహానిపుణుఁడు, కలుముల...బిడ్డ=లక్ష్మికుమారుఁడు, కన్నులవిల్తుఁడు = కణుపులుగల విల్లుగలవాఁడు, కమ్మవిల్తుఁడు = తియ్యనివిల్లుగలవాఁడు, పచ్చవిలుకాఁడు = పచ్చనియెన్ను విల్లుగాఁగల వాఁడు, చక్కెర...జోదు = చక్కెర

విల్లు గలయోధుఁడు, వెడవిలుతుఁడు, = చులకనివిల్లుగలవాఁడు, తియ్య విల్తుఁడు, చిగురాకువిలుకాఁడు = చిగుళ్లచేసైనవిల్లుగలవాఁడు, తుంట ... దునీఁడు = చెఱకుతుంట విల్లుగాఁ గలసరదారు, తలిరువిల్తుఁడు= చిగుళ్లచేసైన విలుగలవాఁడు, ననవిల్తుఁడు = పువ్వులతోఁ జేయఁబడిన విల్లుగలవాఁడు, అలరువిల్తుఁడు, ఇంచువిల్కాఁడు = చెఱకువిల్లుగల వాఁడు, రా...రౌతు = శ్రేష్ఠమైనచిలుక నెక్కి తిరుగువాఁడు, మీను ... మేటి=చేఁపయును మొసలియును ధ్వజమందుఁ గలదిట్ట, తేఁటి...వాఁడు =తుమ్మెదలు అల్లెత్రాడుగాఁ గలవాఁడు- అర=మన్మథుఁడు.

సీ. సతపేరుత త్తడికజత తేరుగలప్రోడ
యనిఁ బడ్డనెఱబంటు కలరుగుత్రోవ
వెన్నునివలగన్ను కవేయిచేతులదిట్ట
తిగవేలుపులరెంకి కపగటిజోతి
జమునయ్య మినుమానికము చాయవెనిమిటి
పగలు సేయువలంతి కజగముకన్ను
నెలజోడు తమ్మిచక్కిలిగింత వేవెల్గు
కలువలసూడు చీఁకటులగొంగ

తే. జక్కవలయంటు మ్రొక్కులఁ జొక్కుసామి
బారరూపుల వేల్పు ప్రాఁబల్కుసొమ్ము
పెట్టి చలిదాయ ప్రొద్దు నాఁ బేళ్లు దనరు
లోకబాంధవునకు శివాలోల సాంబ. 9

టీ. సత...ప్రోడ=సప్త యనుపేరు గల గుఱ్ఱములు రెండు గట్టిన రథము గలనేర్పరి-సప్తాశ్వుఁడు,అని... త్రోవ=యుద్ధమందుహతులై పడు నట్టి మహావీరులు స్వర్గమునకుఁపోవు మార్గము-[ఆవీరులు సూర్యమండలము భేదించుకొని స్వర్గమునకుఁ బోవునట్లు పురాణప్రతీతి). వెన్నుని...గన్ను= విష్ణునికుడినేత్రము, వేయి...దిట్ట=సహస్రహస్తములుగలప్రోడ,తిగ... రెంకి

=త్రిమూర్తులుండుస్థానము, పగటిజోతి=పగటియందు వెలుఁగుజ్యోతియైన వాఁడు, జమునయ్య=యమునితండ్రి, మినుమానికము=ఆకాశమునకు మణి వంటివాఁడు, ద్యుమణి, చాయ పెనిమిటి =ఛాయాదేవిమగఁడు, పగలు... వలంతి=అహస్సును జేయునట్టి నేర్పరి-అహస్కరుఁడు, జగముకన్ను = జగత్తునకు నేత్రమువంటివాఁడు-జగచ్చక్షువు, నెలజోడు=చంద్రునికి జతయైన వాఁడు, తమ్మిచక్కిలిగింత=తామరనుచక్కిలిగింతలు పెట్టి [అనఁగా తాఁకి] వికసింపఁజేయువాఁడు, వేవెల్గు=వేయికిరణములుగలవాఁడు, కలువలసూఁడు= కలువలకువిరోధి, చీఁకటులగొంగ=అంధకారములను నశింపఁజేయువాఁడు, జక్కవలయంటు=చక్రవాకపక్షులకుహితుఁడు, మ్రొక్కుల...సామి=నమస్కారముల కానందించునట్టి దేవుఁడు, బార ..వేల్పు=పండ్రెండురూపములుగలదేవుఁడు. ద్వాదశాత్ముఁడు, పాఁ...పెట్టె=వేదములనెడియాభరణములకుఁ బెట్టెవంటివాఁడు, చలిదాయ = చలినిబోఁగొట్టువాఁడు, ప్రొద్దు = [ప్ర]బ్రధ్న-౨.౨ సూర్యుఁడు,

సీ. కఱకంఠుతలమాని§కము వేలుపులబువ్వ
జాబిల్లి మరుమామ § చందమామ
జింకతాలుపు తొగ§చెలికాఁడు జడదారి
కన్నాప రేఱేఁడు § కడలివెన్న
చుక్కలగమికాఁడు § జక్కవపగవాఁడు
చలివెల్గు రేవెల్గు § చలువజోతి
వెన్నునెడమకన్ను § వెన్నెలరాయఁడు
నెలతమ్మిదాయ ముక్క§న్నిటెపట్టి
తే. కందుగలదుండగీఁడు చీఁ§కటులమిత్తి
పంటవైరులదొర ప్రొద్దు§జంట లచ్చి
యన్న రేజోతి చందన § నమరు చుండుఁ
గుముదమిత్రునినామధే§యములు సాంబ.

టీ. కఱ...మానికము=శివునికి శిరస్సునందలి రత్నమైనవాఁడు, వేలుపులబువ్వ=దేవతలకాహారమైనవాఁడు (దేవతలు చంద్రకళలలో ఒక్కొక్క జేని ఒక్కొక్కఁడుగా తిందురని శ్రుతి), జాబిల్లి = (జాను+బిల్ల) ఒప్పుచున్న బింబముగలవాఁడు, మరుమామ=మన్మథునకు మేనమామ, చందమామ, జింక తాలుపు=జింకనుధరించినవాఁడు, తొగచెలికాఁడు=కలువలకు స్నేహితుఁడు, జడదారికన్నాప=అత్రిమునికి నేత్రమువలనఁ బుట్టినబిడ్డ, రేఱేఁడు=రాత్రికధిపతి, కడలివెన్న = పాలసముద్రమును జిలుకఁగాఁ బుట్టిన వెన్న-అనఁగా పాలసముద్రమునందుఁ బుట్టినవాఁడు, చుక్కలగమికాఁడు= నక్షత్రములకురాజు. జక్కవపగవాఁడు=చక్రవాకములవిరోధి (వానిని ఎడఁబాపువాఁడనుట), చలివెల్గు=చల్లనికిరణములవాఁడు, రేవెల్గు=రాత్రియందుఁ బ్రకాశించువాఁడు, చలువజోతి = చల్లనిజ్యోతియైనవాఁడు, వెన్ను...కన్ను=విష్ణుదేవునివామనేత్రము, వెన్నెలరాయఁడు = చంద్రికకు అధిపతి, నెల, తమ్మిదాయ=తామరలకువిరోధి, మున్నీటిపట్టి = పాలసముద్రునిబిడ్డ, కందు...దుండగీఁడు=నల్లనికళంకము గలధూర్తుఁడు, చీఁకటులమిత్తి = అంధకారములను హరించువాఁడు, పంటపైరులదొర = సస్యములకుఅధిపతి, ప్రొద్దుజంట = సూర్యునికిజతయైనవాఁడు, లచ్చియన్న=లక్ష్మికిఅన్నయైన వాఁడు, రేజోతి = రాత్రియందుఁ బ్రకాశించుజ్యోతియైనవాఁడు, చందు (ప్ర. చంద్రుఁడు) - ౨౭ = చంద్రుఁడు.

సీ॰ పదిపదులంచులకెౕ బాఁకు దాల్చుదునీఁడు
కొండలఱెక్కలుకొౕట్టినదణి
జమిడియేఁబదులజకెౕన్నములు చేసినమేటి
సోమాసులకుఁ దాపు౯ సూపుజాణ
గొముత్తిరంపుఁజెవులకెౕత త్తడివజ్రీఁడు
విప్పుఱెప్పలఱేఁడు౯ వెల్లగొౕరు
మావటీఁడు తలఁపుకెౕమానికము గలాఁడు
నిలువెల్లఁ జూపులై౯ వెలయువాఁడు

తే. మింటిప్రోల్సామి జడదారి § యింటికోడి
పెట్టుమ్రాఁకుల వెలిగిడ్డిఁ § బెనిచినదొర
మొదటిదిక్కుసుబాదారి § మొయిలుజక్కి-
సామి యన నింద్రునామముల్ § జరగు సాంబ. 11

టీ. పది...దునీఁడు=(౧౦×౧౦)నూఱంచులుగల వజ్రాయుధమును ధరించునట్టి సరదారు, కొండ...దణి=పర్వతముల ఱెక్కలను ఖండించిన దొర, జమిడి...మేటి = (౨+౫౦) నూఱుయజ్ఞములు చేసినదిట్ట-శతక్రతుఁడు, సోమ...జాణ=సోమయాజులకు స్వర్గమునందువసతిచూపునట్టి నేర్పరి, ఎత్తరంపు...వజీరుఁడు=పొడవైన చెవులుగలగుఱ్ఱము (అనఁగా ఉచ్చైశ్శ్రవము) నెక్కెడు శూరుఁడు, విప్పు ఱెప్పల ఱేఁడు=తెఱచుకొనియుండు ఱెప్పలుగలవారికి - అనఁగా ఱెప్పపాటులేనివారు (అనిమిషులు) అగుదేవతలకురాజు, వెల్ల...మావటీఁడు=తెల్లయేనుఁగు నెక్కెడివాఁడు, తలఁపు...గలాఁడు - చింతామణిగలవాఁడు, నిలువు...వాఁడు=శరీరమెల్లఁ గన్నులు గలిగియొప్పువాఁడు-సహస్రాక్షుఁడు, మింటి...సామి=అమరావతికధిపతి, జడ...కోడి=గౌతముఁడనుఋషిగృహమునఁ గుక్కుటమైయుండినవాఁడు, పెట్టుమ్రాఁకుల...దొర=కల్పవృక్షములను గామధేనువును బెంచినప్రభువు, మొదటి...సుబాదారి=తూర్పుదిక్కునేలెడి యధికారి, మొయిలు జక్కి-సామి=మేఘవాహనముగలదేవుఁడు-౧౨=దేవేంద్రుఁడు.

సీ. తగరుబాబాసామి § దుగమోరపాదుసా
తెమ్మెరచెలి యన్ని § తిండికాఁడు
నీటిబిడ్డఁడు కిత్తు § నిప్పు ముట్టఁగరాని
బలియుఁడు సతనాలు § కలదునీఁడు
కప్పత్రోవరి తిగ § కాళ్ల దేవర యగ్గి
చిచ్చింగలం బనఁ § జెలఁగు వహ్ని

పోతుతత్తడిరౌతు ప్రొద్దుకూన జముండు
మిత్తి దక్కినమేలు మేటి జమున
తే. తోడు గుదెతాల్పు పెతరులఱేఁడనంగఁ
గాలునిసమాహ్వయము లగు మూలఱేఁడు
ౘిమ్మరీఁడు రక్కసి పొలదిండి సోఁకు
మూఁకదణి నా నిరృతిపేళ్లు పొసఁగు సాంబ. 12

టీ. తగరు .. సాని=పొట్టేలు వాహనముగాఁ గలరౌతు, దుగ... పాదుసా = రెండుముఖములుగలదొర, తెమ్మెరచెలి = వాయుదేవునిస్నేహితుఁడు, అన్ని తిండికాఁడు=సర్వమును భక్షించువాఁడు, నీటిబిడ్డఁడు=జలమునందుఁ బుట్టినవాఁడు, కిత్తు, నిప్పు, ముట్టఁగరానిబలియుఁడు=అంటుటకు అలవికానిబలవంతుఁడు, సత...దునీఁడు=ఏడుజహ్వలుగలసరదారు-సప్తజిహ్వుఁడు, కప్పుత్రోవరి=నల్లదారిగలవాఁడు కృష్ణవర్త్మ, తిగ... దేవర=మూఁడుపాదములు గలదేవుఁడు, అగ్గి=(ప.)అగ్ని, చిచ్చు, ఇంగలము=(ప్ర)అంగారము-౧౫అగ్ని. పోతు...రౌతు=మహిషవాహనమునెక్కి తిరిగెడివాఁడు, ప్రొద్దు కూన=సూర్యునిబిడ్డఁడు, జముఁడు=(ప్ర) యముఁడు, మిత్తి=(ప్ర) మృత్యువు. దక్కి.., మేటి=దక్షిణదిక్కును బాలించుదిట్ట, జమునతోడు=యమునానది సహోదరుఁడు, గుదెతాల్పు=గుదియను ధరించినవాఁడు, పెతరుల ఱేఁడు = పితృదేవతలకురాజు-౮ = యముఁడు. మూలఱేఁడు=నైరృతిమూలకురాజు, ౘిమ్మరీఁడు=రాత్రులయందుఁ దిరుగువాఁడు, రక్కసి = (ప్ర) రాక్షసుఁడు, పొలదిండి=మాంసమును భక్షించువాఁడు, సోఁకుమూఁకదణి=రాక్షస సమూహముల కధిపతి-౫=నిరృతి.

సీ. పడమటిదొర నీటియొడయఁడు జడిసామి
మొసలిగుఱ్ఱమురౌతు ముయిఁ ఱేఁడు
వల్లెత్రాడు గలట్టివాఁడు నా వరు
లమరెను జింకగుఱ్ఱమువలఁ

బీదలవెనుబాద యీఁద త్రాఁచులమేఁత
గందపుమలగుబికాఁడు గాడ్పు
పయ్యెర తావిమోపరి వలి మరుతేరు
నుడిగొట్టు తెమ్మెర సోఁకుబూచి
తే. మేనుతాల్పుల కుసురైనమేటి నింగి
చూలి మబ్బులపగదాయ గాలి సురఁటి
వీవనలపుట్టు దువ్వగావించుజాణ
కరువలి యనంగ మారుతాఖ్య లగు సాంబ. 13

టీ. పడమటిదొర=పశ్చిమదిక్కునకు రాజు, నీటియొడయఁడు=జలములకధిపతి, జడిసామి=వర్షమున కధిదేవుఁడు, మొసలిరౌతు=మొసలివాహనము నెక్కి తిరుగువాఁడు, మొయిలుఱేఁడు=మేఘములకధిపతి, వల్లె... వాఁడు=పాశమునుధరించినవాఁడు-ఉ=వరుణుఁడు. జింక...వలంతి=జింక వాహనము గలనేర్పరి, బీదల...బాద=బీదవారిని చలిచే మిక్కిలి బాధ పెట్టువాఁడు, ఈఁద=చలి గాలి. త్రాఁచులమేఁత=సర్పముల కాహారము, గంద...కాఁడు-మలయపర్వతము స్థానముగుఱుతుగాఁ గలవాఁడు (అనఁగా మలయగిరినుండి గుబిగా వీచువాఁడు), గాడ్పు, పయ్యెర, తావిమోపరి=వాసనలను వహించువాఁడు (అనఁగావ్యాపింపఁ జేయువాఁడు)-గంధవహుఁడు, వలి,మరుతేరు=మన్మథునిరథము, నుడిగొట్టు=నుడికొట్టువాఁడు, తెమ్మెర,సోఁకుబూచి=కనఁబడకుండస్పృశించునట్టిదేవుఁడు, మేను...మేటి=శరీరధారులగుజంతువులు జీవించుట కాధారమైనదట్టి, నింగిచూలి=ఆకాశమునఁబుట్టినవాఁడు, మబ్బుల పగదాయ=మేఘములకువిరోధి, గాలి,సురఁటి... పుట్టు=వ్రతువలగుసురఁటులందును విసనకఱ్ఱలందును బుట్టువాఁడు,దువ్వ...జాణ=ధూళి రేఁచునట్టినేర్పరి కరువలి-౦=వాయుదేవుఁడు.

సీ. జక్కులపాదు ముక్కంటిసంగాతి
కాయక కులఱేఁడు

వానీఁడు రారాజు • వడచక్కియొకిమీఁడు
  తత్తడినెక్కెడు • దంట యనఁగ
ధనదు పే ళ్లగు జడ • దారి గిబ్బసిపాయి
  తిగకంటిదొర తుది • దిక్కుటెంకి
యనఁగ నీశానాఖ్య • లను వొందుఁ జిందము
  కూఁతకైదువు బూరఁ • గొమ్మ సంకు
తే. వలమురి యనంగ శంఖము • వెలయుఁ జుట్టు
  వాలు సుడివాలు వ్రట్టువ • వాలు బటువు
  వాలు పదినూటులంచుల • వాలు బిల్ల
  వా లన సుదర్శనాఖ్యలు • వఱలు సాంబ. 14

టీ. జక్కులపాపసా=యక్షులకురాజు, ముక్కంటిసంగాతి = శివుని చెలికాఁడు, కాయకన్నేటి=కాయకాచినయొకకన్ను గలదిట్ట, లేక కాయ వలెఁ బచ్చనైనయొకకన్ను గలవాఁడు, రొక్కముల ఱేఁడు=ధనముల కధిపతి, వానీఁడు(వానె+ఈఁడు)=వానెకులము వాఁడు, రారాజు=రాజరాజు, వడయొకిమీఁడు = ఉత్తరపుదిక్కున కధిపతి, తత్తడి...దంట=గుఱ్ఱము వాహనముగాఁగలదిట్ట-౦=కుబేరుఁడు. జడదారి=జడలను ధరించినవాఁడు, గిబ్బసిపాయి=వృషభము నెక్కితిరుగువీరుఁడు, తిగకంటిదొర=మూఁడుకన్నులు గలప్రభువు, తుది... టెంకి=కడపటిదైన యీశాన్యదిక్కు వాసస్థానముగాఁ గలవాఁడు-౪=ఈశానుఁడు. చిందము, కూఁతకైదువు, బూరఁగొమ్మ, సంకు, వలమురి=దక్షిణముగాఁ దిరిగినది-౫=శంఖము. చుట్టువాలు, సుడివాలు, వ్రట్టువవాలు, బటువువాలు (ఈనాలుగు పేళ్లకును గుండ్రని యాయుధమని అర్థము), పదినూటంచులవాలు = వేయి మొనలు గలవాలు, బిల్లవాలు=బిల్లవలె నుండు నాయుధము - ౬=విష్ణుదేవుని సుదర్శనమనెడు చక్రాయుధము.

సీ. తుదచుక్క పేరిటి • తొయ్యలి వెనిమిటి
  కప్పుదేవరయన్న • కలపదారి

కటిపల్వప్రోడ రోకలితాల్పు తాటిజె
క్కెము మేటిబలియుఁడు జమునగొంగ
యన బలభద్రుపే ళ్లగుఁ గ్రీడిచెలితేరు
పులుఁగురాయఁడు దెలిమోముపక్కి
బొల్లిమోరపులుంగు నల్లనయ్యరవాలు
తోడలేనివానిసైదోడు గరుడి
తే. వేలుపులబువ్వ గొనుజోదు వెన్నుపడగ
చిలువమేఁతరి మేలిచ్చుపులుఁగు గరుటి
తల్లివేసట వాపినదంట యనఁగ
వైనతేయసమాఖ్యలు వఱలు సాంబ. 15

టీ. తుద...పెనిమిటి=కడపటిచుక్కయైన రేవతియను పేరుగల స్త్రీకి భర్తయైనవాఁడు, రేవతీరమణుఁడు, కప్పు...యన్న=నల్లనిదేవుఁడగు విష్ణుని కన్న, కలపదారి=నాఁగేటిని ధరించినవాఁడు, కటి...ప్రోడ=నల్లని వస్త్రమును గట్టు నేర్పరి - నీలాంబరుఁడు, రోకలితాల్పు=ముసలమును ధరించిన వాఁడు, తాఁటి...బలియుఁడు=తాళధ్వజముగల గొప్పబలవంతుఁడు, జమున గొంగ=యమునానదికి శత్రువు-౭=బలరాముఁడు. క్రీడి.., తేరు=అర్జునునకు చెలికాఁడైనవిష్ణునివాహనము, పులుఁగురాయఁడు=పక్షిరాజు, తెలి...పక్కి= తెల్లనిముఖము గలపక్షి, బొల్లి...పులుఁగు=తెల్లనిముఖము గలపక్షి, నల్లనయ్య రవాలు = విష్ణుదేవునిరవగాలు-అస్కందితగతిని బోవుగుఱ్ఱము-విష్ణుదేవుఁడు వేగముగాఁ బోవుటకు సాధనమైనవాహనము, తోడ...సైదోడు=అనూరుని తోఁబుట్టువు, గరుడి=(ప్ర) గరుడుఁడు, వేలుపుల...జోదు=దేవతలకాహార మైనయమృతమును హరించునట్టియోధుఁడు, వెన్నుపడగ=విష్ణునిధ్వజము, చిలువమేఁతరి=సర్పములను భక్షించువాఁడు, మేలిచ్చుపులుఁగు=శుభముల నిచ్చునట్టిపక్షి, గరుటి, తల్లి...దంట=తల్లియగు వినతదుఃఖమును దీర్చిన నేర్పరి-౧౩=గరుత్మంతుఁడు.

సీ. వడముడి తెమ్మెరకొడుకన భీముఁడౌ
వేగంటికొమరుఁడు వెన్నునంటు
వెన్నుమచ్చరుఁడు వివ్వచ్చు కవ్వడి
గెలుపుపేరుగలాఁడు క్రీడి యనఁగ
నర్జుననామంబులగు ముత్తెరువులాఁడి
తెలివాఁక పొందామరలకొంబంటు
కలికంఠుతలయేఱు పెరుమాళ్లడుగుబుగ్గ
జడదారిచెవియూట చదలువాఁక
తే. తాటిటెక్కెముదణితల్లి తాతపనఁటి
వెల్లి మినువాఁక మిన్నేఱు వేల్పుటేఱు
తెల్లకానుపుసవతితల్లి యనఁ దనరు
నమరతటినికి నామధేయములు సాంబ. 16

టీ. వడముడి, తెమ్మెరకొడుకు=వాయుదేవుని కుమారుఁడు - ౨=భీముఁడు. వేగంటికొమరుఁడు=వేయికన్నులుగల యింద్రునికొడుకు, వెన్నునంటు=కృష్ణుని చెలికాఁడు, వెన్ను...రుఁడు = వీఁపునందు మచ్చగలసరదారు, * వివ్వచ్చు=(ప్ర) బీభత్సుఁడు,కవ్వడి=(కవ+వడి) రెండుచేతుల వడిగలవాఁడు, గెలుపు...గలాఁడు=విజయుఁడను పేరుగలవాఁడు, క్రీడి=కిరీటి-౭=అర్జునుఁడు. ముత్తెరువులాఁడి=మూఁడుమార్గములఁ బ్రవహించునది. త్రిపథగ, తెలివాఁక=తెల్లనినది, పొం...బంటు=బంగారు తామరలుపూచునట్టిచోటు, కలికంఠుతలయేఱు=శివునిశిరస్సున నుండునది, పెరు...బుగ్గ=విష్ణువుపాదమునందుఁ బుట్టిన నీటిబుడ్డ - విష్ణుపది, జడ...యూట=జహ్నువనెడుఋషి చెవినుండి యూరి వచ్చిన జలము-జాహ్నవి, చదలువాఁక=ఆకాశనది, తాటి...తల్లి=తాళధ్వజముగలవారయగుభీష్మునితల్లి, తాత...

* దీనికి దుర్వర్ణకము రామి విచార్యము.

వెల్లి = బ్రహ్మాండమండలు జలప్రవాహము, మినువాఁక, మిన్నేఱు, వేల్పుటేఱు = దేవతలనది, ఱెల్లు...తల్లి = కుమారస్వామికి మాఱుఁదల్లి-౧౩=౫౦౫.

సీ. వేల్పులనువారంబు * విడిది వెన్నునితెంకి
రతనాలపంట సంకద్రంబు కడలి
పుడమిముద్దియకోక * మున్నీరు ప్రాయేఱు
మబ్బుపువ్వులవెల్లి * మామమామ
గట్టురాకొమరునిఁ * గాచిన నేర్పరి
యేఱులమగఁడు రేయింతిమామ
ముక్కంటియమ్ములపొది మింటిలాయంబు
తోఁటదొడ్డియొనర్చు * నీటుకాఁడు

తే. చందునయ్య లచ్చితండ్రి నా * జలధి పరఁగు
వెల్లయేనుఁగు చాదంతి * వేల్పుగొఱు
మొదటిపాత్తి నా సురకరి * పొదలుఁ దెల్ల
జక్కి నిక్కువీనులమావు * చదలు తేజి
యనఁగ నుచ్చైశ్శ్రవముపేరు * లమరు సాంబ. 17

టీ. వేల్పు...విడిది = దేవతలవంటయిల్లు, వెన్నునితెంకి = విష్ణుదేవుని వాసస్థానము, రతనాలపంట = రత్నములు పండుచోటు - రత్నాకరము, సంద్రము = (ప్ర) సముద్రము. కడలి = కడలు (అనఁగా అలలు) గలది, పుడమి...కోక = భూదేవిచీరయైనది, మున్నీరు = (ముందు + నీరు) పురాతనమైనజలము, ప్రాయేఱు = (ప్రాఁత + ఏఱు) పురాతన నది, మబ్బుపువ్వులవెల్లి = మేఘపుష్పముల (అనఁగా జలముల) రాశి, మామమామ = మామయగు విష్ణుదేవునికిమామయైనవాఁడు, గట్టు... నేర్పరి = హిమవంతునికొడుకగు మైనాకుని గాపాడినప్రోడ, ఏఱులమగఁడు = నదులకు భర్త, రే...మామ = రాత్రి యను స్త్రీకి మామయైనవాఁడు-రాత్రి చంద్రునిభార్యయను ప్రతీతినిబట్టి చంద్రునితండ్రి

యగుసముద్రుఁడు దానికి మామగాఁజెప్పఁబడెను, ముక్కంటి... పొది=శివునికి త్రిపురాసురులను సహరించునపుడు తూణీరమైనవాఁడు,మింటి...నీటుకాఁడు=ఆకాశమును (అనఁగా స్వర్గమును) గుఱ్ఱపులాయముఁగానువృక్షములతోఁటఁగాను ఆవుదొడ్డిఁగాను జేసినవేర్పరి-స్వర్గంబునఁ గల యుచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును కల్పవృక్షములను గామధేనువును గన్నట్టివాఁడనియర్థము. చందునయ్య-చంద్రునితండ్రి, లచ్చితండ్రి=లక్ష్మిదేవితండ్రి-౧౭=సముద్రుఁడు. వెల్లయేనుఁగు=తెల్లనిగజము, చౌదంతి=నాలుగుదంతములు గలది, వేల్పుగొరు=దేవతలగజము, మొదటిహత్తి=ప్రథమగజము-౪=ఐరావతము. తెల్లజక్కి=తెల్లనిగుఱ్ఱము, నిక్కువీనులమావు=పొడవైనచెవులు గలగుఱ్ఱము. నదలుతేజి=ఆకాశమునందుండు గుఱ్ఱము-౩ఉచ్చైశ్శ్రవము.

సీ. వేలుపుటెంకి కోవెల దేవళము గుడి
 యనఁగ దేవాలయాఖ్యలు చెలఁగుఁ
దెఱగంట్లు జన్నంపుఁదిండులు జేజేలు
 తొలివేల్పుపగతురు పలుకుటల్లు
మేటులు వేల్పులు మింటిత్రోవరులు ని
 ద్దురలేనిప్రోడలు నరలు గనని
పెద్ద లనఁగ సురాభిఖ్య లౌ విన్ప్రోలు
 వేగంటికచ్చేరి వేల్పుటెంకి
తే. యనఁగ స్వర్గముపేళ్లగు విసుమిటూరు
 లచ్చరలు వేల్పుచెలు లన నమరు నమర
 తరుణులకుఁ జాగరతనము తలఁపుమాని
 క మనఁ జింతామణిసమాఖ్య లమరు సాంబ. 18

టీ. వేలుపు టెంకి=దేవస్థానము, కోవెల, దేవళము=(ప్ర) దేవాలయము, గుడి-౪=దేవాలయము. తెఱగంట్లు=తెఱచుకొనియుండు కన్నులు

గలవారు, జన్నంపుఁదిండులు=యాగములందు హవిస్సులను భక్షించువారు, జేజేలు, తొలివేల్పుపగతురు=పూర్వదేవతలగు రాక్షసులకుశత్రువులు, పలుకుటల్గు మేటులు=మాటలె యాయుధముగాఁ గలవారు-గీర్వాణులు. వేల్పులు, మింటిత్రోవరులు=ఆకాశమున సంచరించువారు, నిద్దురలేని ప్రోడలు=నిద్ర పోవుట లేనిదిట్టలు, నరలు... పెద్దలు=పలితములు (అనఁగా ముదిమి) లేని పెద్దవారు-౯=దేవతలు. విన్ ప్రోలు=ఆకాశమునందలి పట్టణము, వేగంటికచ్చేరి = దేవేంద్రుని కొలువుకూటము, వేల్పుటెంకి=దేవతల నివాసస్థానము-౩=స్వర్గము. వినుమిటారులు = ఆకాశమునందలి స్త్రీలు, అచ్చరలు=[ప్ర] అప్సరసలు, వేల్పుకెలులు-౩=దేవతా స్త్రీలు చాగరతనము=కోరినసంపదలదానముసేయురత్నము, తలఁపుమానికము=చింతామణి-౨=చింతామణి.

సీ. అడిగిన నొసఁగెడియావు జేజేగిడ్డి
   చదలుతొడుకు తెల్లమొదవనఁగ
సురగవి పేళ్లగుఁ దెఱగంటిమ్రాఁకులు
   వెట్టుమ్రాఁకులు మింటిచెట్టు లనఁగఁ
గల్పకాఖ్య లగు వేగంటిగొంగలు రక్క
   సులు రేయిద్రిమ్మరుల్ సుకురుసినులు
వేల్పుదాయలు తొలివేల్పులు నా దైత్య
   నామంబు లగు గాలి గాము నెగడి
తే. కొఱవిరాలుపు బూఁచి పోఁకుడు పిసాసి
దయ్య మనఁగఁ బిశాచాభిధానము లగు
నివము వలి మంచనంగను హిమము దనరుఁ
బిషు గనఁగ జెల్లు నశనికిఁ బెళ్లు సాంబ. 19

టీ. అడిగిన నొసఁగెడియావు=కోరినవానినిచ్చునట్టి ధేనువు, జేజేగిడ్డి=దేవతలయావు, చదలుతొడుకు=ఆకాశమునందుండు ధేనువు, తెల్లమొదవు=

తెల్లనియావు - ర=కామధేనువు. తెఱగంటి మ్రాఁకులు=దేవతావృక్షములు, పెట్టు మ్రాఁకులు=కోర్కులిచ్చుచెట్లు, మింటిచెట్లు=ఆకాశమందుండు వృక్షములు-౩=కల్పవృక్షములు. వేగంటిగొంగలు=ఇంద్రునకు శత్రువులు,రక్కసులు=(ప్ర) రాక్షసులు, రేయిద్రిమ్మరులు=రాత్రులందుఁదిరుగువారు, సుకురుసిసులు=శుక్రాచార్యునిశిష్యులు, వేల్పుదాయలు=దేవతలకు దాయాదులు-లేక శత్రువులు, తొలివేల్పులు=పూర్వదేవతలు-౯=రాక్షసులు. గాలి, గాము=(ప్ర) గ్రహము, నెగడి, కొఱవిరాలువు, బూచి, సోఁకుడు, పిసాసి=(ప్ర) పిశాచము, దయ్యము-౮=పిశాచము. ఇవము- (రూపా. ఇగము. ప్ర. హిమము,)వలి, మంచు-౩=హిమము. పిడుగు=అశని-వజ్రాయుధము.

సీ. మిన్ను చుక్కలత్రోవ • [illegible]న్నుప్పరము నింగి
వెన్నునియడుగు విన్ • వేల్పుఁదెరువు
గాలితండ్రి బయు లాకసము మొగులుతెన్ను
చదలు నా గగనాఖ్య • లాదవు చుండుఁ
బవలు పగలు నాఁగ • దివముపే ళ్లగు రేయి
రాతిరి రే యన • రాత్రి యమరు
దెస దిక్కు కడ యన • దిశ యొప్పు నెల చంద
నఁగ మాస మమరుఁ బున్నమ యనంగ
తే. నలరుఁ బూర్ణిమకు నమాస • యమవస యనఁ
జను నమావాస్యపేరులు • సంజ సందె
యనఁగఁ దగు సంధ్య కాతపం[illegible] నెండ
ప్రొద్దు వేండ్రం బనెడిపేళ్లు • [illegible]ంబ. 20

టీ. మిన్ను, చుక్కలత్రోవ=న[illegible] ఉప్పరము, నింగి, వెన్నునియడుగు=విష్ణుపదము, [illegible] గాలితండ్రి=వాయువునకు జన్మసా[illegible] మేఘముల మార్గము, చదలు

రేయి, రాతిరి, రే-3రాత్రి. దెస=(ప్ర) దిశ. దిక్కు (ఇది సంస్కృతసమము), కడ=(ప్ర) కాష్ఠ-3=దిశ. నెల, చందు-౨=మాసము. పున్నమ=పూర్ణిమ. అమాస, అమవస-౨=అమావాస్య. సంజ, సందె-౨= సంధ్య. ఎండ, ప్రొద్దు, వేండ్రము-3=ఎండ.

సీ. మెఱుపులు మెఱుఁగులు ♦ మించు లనఁ దటిత్తు
లగును జుక్కలు రిక్క ♦ లనఁగఁ దార
లమరు జేజేజేనిరయరదము నీటిమోఁ
పరి మబ్బు మొయిలు లనఁ ♦ బరఁగు ఘనము
తెర యల తరఁగ నాఁ ♦ బొరయు వీచికపేళ్లు
నురువు నురుఁ గనంగఁ ♦ గొఱలు ఫేన
మంతస్సమాభిఖ్య ♦ లగును లోపల లోన
లో నన బహిరాఖ్య ♦ లొప్పును వెలి
తే. బయలు వెలుపల నాఁగ దీపంబుపేళ్లు
వఱలుచుండును జోతి తిర్వాళిక దివ్వె
యనఁగ మందోష్ణమునకు వెచ్చన యొకింత
వేఁడి యినుమంత కాఁక నా ♦ వెలయు సాంబ. 21

టీ. మెఱుపులు, మెఱుఁగులు, మించులు-3=మెఱుపుఁదీఁగెలు. చుక్కలు, రిక్కలు=(ప్ర)ఋక్షములు-౨=నక్షత్రములు. జేజేజేనియరదము=దేవేంద్రుని రథము, నీటిమోపరి=జలమును ధరించునది-జలధరము, మబ్బు, మొయిలు ॥రూ॥ మొ[illegible] [illegible]పా॥ మొగులు ॥రూ॥ మొగిలు-౪=మేఘము. తెర, అల, తరఁగ[illegible] [illegible]-3=అల. నురుఁగు, నురువు-౨=ఫేనము. లోపలన్, లో[illegible] [illegible] వెలి, బయలు ॥రూ॥ బయిలు-బైలు, వె[illegible] [illegible]స్సు, తిర్వాళిక (ఇది యఱపపదము) [illegible]వె)-3=దీపము. వెచ్చన, ఒకింత వేఁ

క. సిస్తుగ లక్షణకవి యగు
కస్తురిరంగాఖ్యుఁడను జగద్ధితముగ నీ
నిస్తులదైవతవర్గను
విస్తర మొనరించినాఁడ విబుధులకరుణన్. 22

తా. లక్షణము చక్కఁగాఁ దెలిసిన కవిని. కస్తురిరంగనామముగలవాఁడను. పండితులదయచేత లోకములకు హితముగా నసమానమైన యీదేవవర్గను విస్తరింపఁ జేసినాఁడను.

## దేవవర్గసంపూర్ణము.

---

## మానవవర్గ.

క. శ్రీనగజామానసలస
మానసరోహంస నిరుపమానవిభవధా
మా నవముగ నీపేరిట
మానవవర్గువు రచింతు మానక సాంబా. 1

టీ. శ్రీపార్వతీదేవిమనస్సు అనెడు ప్రకాశించుచున్న కొలనికి హంసయైనవాఁడా! (పార్వతీహృదయమందు విహరించువాఁడని యర్థము.) పోలికలేని వైభవములకు స్థానమైనవాఁడా! సాంబమూర్తీ! క్రొత్తగ మానవవర్గను నీ కంకితముగా రచించెదను.

సీ. తొలిచదువులు ప్రాఁతపలుకులు మినుకులు
ప్రామినుకులు తొంటిబాస లనఁగ
వేదాఖ్య లగు నేలవేల్పులు తొలిజాతి
వారు మిన్కులచదువరులు జన్నిँ

బుడుత నా శిశునామక§ములు దనర్చు

తే. గోల ముద్దియ ముద్దరాల్ § బేల ముగుద
యనఁగ ముగ్ధాంగనకు నాఖ్య § లగును ముదిమి
వాఁడు ముదుకఁడు ముదిసిన§వాఁడు ముసలి
ముదుసలి యనంగ వృద్ధుపే § ళ్లొదవు సాంబ. 4

టీ. అయిదువరాలు-॥రూ॥ ఐదువరాలు, ముత్తైదువ - తి=సుమంగలి. తోడికోడలు, ఏరాలు-తి=మగనిసహోదరునిభార్య. కూఁతురు, కూఁతు, కొమరిత ॥రూ॥ కొమారిత-కొమార్త-కొమారి-ఱ=కుమారి. కొమరుఁడు ॥రూ॥ కొమారుఁడు, బాడుకఁడు, కొడుకు, పట్టి-ఱ=కుమారుఁడు. బిడ,బిడ్డ, వూప, పాప, కుఱ్ఱ, చిఱుత, కందు, కూన, నిసువు ॥రూ॥ నిసుఁగు, ॥పా॥ సిసువు, పాలబుడుత-౧-తి=శిశువు. గోల, ముద్దియ, ముద్దరాలు, బేల, ముగుద=(ప్ర.) ముగ్ధ-ఱ=ముగ్ధస్త్రీ). ముదిమివాఁడు ॥రూ॥ ముది, ముదుకఁడు, ముదిసినవాఁడు, ముసలి, ముదుసలి-ఱ=వృద్ధుఁడు.

సీ. పిన్న కొండికవాఁడు § చిన్నపడుచు చోఱ
పసివాఁ డనెడిపేళ్లు § బాలున కగుఁ
జతురుపే ళ్లగు దిట్ట § జాణ దంట వలంతి
వెరవరి ప్రోడ నేర్పరి యనంగఁ
జెలికాఁడు సంగాతి § చెలిమరి గాదిలి
సకియ సంగడికాఁడు § సంగడీఁడు
చెలి నేస్తి యనఁ జను § స్నేహితునకుఁ జెల్మి
నంటు మాలిమి పొందు § నంగ మైత్రి

తే. కొఱలుఁ గుఱుచ టింగణ గిడ్డ § గిఱక గుజ్జు
పొట్టి యన వామనాఖ్య లౌ § గట్టివాయి
తాఁగ జంత గయ్యాళియు § నాఁగఁ దనరు

ధూర్తవనితకు దురితవి§దూరసాంబ. 5

టీ. పిన్న, కొండికవాఁడు, చిన్న, పడుచు, చోఁఱ ॥రూ॥ చోఱ, పసివాఁడు-౬=బాలుఁడు. గిట్ట, జాణ, దంట, వలఁతి, వెరవరి, ప్రోడ, నేర్పరి-౭=చతురుఁడు. చెలికాఁడు, సంగాతి, చెలిమరి, గాదిలి, సకియ, సంగడికాఁడు, సంగడీఁడు, చెలి, నేస్తి-౯=స్నేహితుఁడు. చెల్మి, ॥రూ॥ చెలిమి, నంటు, మాలిమి, పొందు-౪=మైత్రి. కుఱుచ, టింగణ ॥రూ॥ టింగణా, గిడ్డ, గిఱుక, గుజ్జు, పొట్టి-౬=వామనుఁడు, గట్టివాయి, టాఁగ, జంత, గయాళి [రూ॥ గయ్యాళి] - ౪ = ధూర్తురాలు.

సీ. కబ్బముచేఁతరి § కయి కైసరుఁడు మాట
లల్లువాఁ డనుపేళ్లు § చెల్లుఁ గవికి
బట్టులు చదువరుల్ § బట్లు క్రిక్కు లనంగ
వందుల కగుఁ బడ§వాళ్లు వేగు
వారు వేగరు లనఁ § జారులపే ళ్లొప్పు
బోయీలు బెస్తలు § మోపరు లన
వాహకులకుఁ జెల్లు § సాహిణి సాని రౌ
తనఁగ నశ్వారోహ§కునకుఁ దనరుఁ
తే. గట్టికలు పణిహారులు § కటిక లనఁగ
వేత్రపాణుల కగు బోయ § వేఁటకాఁడు
నడవిద్రిమ్మరి యనఁ గిరా§తాఖ్య లెసఁగు
నన్నగళ పేడి యన షండుఁ § డగును సాంబ. 6

టీ. కబ్బముచేఁతరి, కయి, కైసరుఁడు, మాటలల్లువాఁడు-౪=కవి. బట్టులు, చదువరులు, బట్లు, క్రిక్కులు-౪=వందులు. పడవాళ్లు, వేగువారు, వేగరులు-౩=చారులు. బోయీలు ॥రూ॥ బోయలు, బెస్తలు, మోపరులు-౪=వాహకులు. సాహిణి, సాని, రౌతు-౩=అశ్వారోహకుఁడు, కట్టికలు, పణిహారులు, కటికలు ౩=బెత్తము చేతఁగలద్వారపాలకులు మొదలైనవాలు

వుడుగాంద్రు. బోయ, వేఁటకాఁడు, అడవిద్రిమ్మరి - 3 = బోయవాండ్రు [కిరాతకులు]. అన్నగళ, పేడి-౨=నపుంసకుఁడు.

సీ. జాలరి వలఱేఁడు – మీలవేఁటరి యనఁ
దగు ధీవరుని పేళ్లు – తడుపుదాల్పు
వడు గొంటిజందెము – వాఁడు బ్రహ్మచారి
యన బ్రహ్మచారి పే – ళ్లమరు గేస్తు
మనికిఱేఁ డింటివాఁ – డన గృహస్థున కగు
నడవికాఁపు తపసి – జడలదారి
నాఁ జెలువొందు వా – నప్రస్థునకు నొంటి
కాఁడు గోఁణముదారి – బోడ బీద

తే. కావులుగలాఁడు సన్న్యాసి – నా వెలుంగు
యతిసమాఖ్యలు ముగితిము – త్తైదు వనఁగ
జక్కి ననఁ బేరఁటా లన – జరుగు మృతచి
రంటినామంబు లాపన్న – రక్ష సాంబ. 7

టీ. జాలరి=జాల [వల] లు గలవాఁడు. వలఱేఁడు, మీలవేఁటరి=మత్స్యములను వేఁటాడువాఁడు-3=చేఁపలనుబట్టువాఁడు. తడుపుదాలుపు=చిన్నవస్త్రము గట్టుకొనువాఁడు, వడుగు=[ప్ర] వటువు, ఒంటి జందెము వాఁడు=ఒక పేటజందెముగలవాఁడు, బ్రహ్మచారి-౪ = బ్రహ్మచారి. గేస్తు=[ప్ర] గృహస్థు, మనికిఱేఁడు, ఇంటివాఁడు-3=గృహస్థుఁడు. అడవికాఁపు =అడవియందు నివసించువాఁడు, తపసి - [ప్ర] తపస్వి = తపస్సు చేయువాఁడు, జడలదారి=జడలనుధరించినవాఁడు-3=వానప్రస్థుఁడు. ఒంటికాఁడు, గోఁణముదారి=కౌపీనముధరించినవాఁడు, బీద, కావులుగలాఁడు=కాషాయము లను ధరించినవాఁడు, సన్న్యాసి=[ప్ర]సన్న్యాసి-౫సన్న్యాసి. ముగితిముత్తై

దువ=ముక్తిచెందిన సువాసిని, జక్కని, పేరటాఁలు - 3 = మృతచిరం [లోకాంతరముపొంది దేవత్వము వడసిన ముత్తయిదువ].

సీ. మూకాఖ్యు లగు మూవ మూఁగ మూఁగి యనఁగ
గ్రుడ్డి చీకన నంధకునకుఁ జెల్లుఁ
బరువము ప్రాయము వయసు జవ్వన మన
యౌవనాభిఖ్య లౌ నందగాఁడు
వగకాఁ డమరువాఁడు వన్నెకాఁ డెమ్మెకాఁ
డౌనుకాఁ డన సొగసైనవాఁడు
నీటుకాఁ డనఁగ రాణించు శృంగారికి
గోవాళ్లు బొజుఁగు నాఁ గోడెకాఁడు
తే. వెచ్చకాఁడు ననుపుకాఁడు వేడ్కకాఁడు
లంజెకాఁడు మిండఁ డనఁ బల్లవుఁడు దనరు
సోయగంబు చక్కఁదనంబు సొబగు రూపు
నాఁగ సౌందర్యమునకుఁ జెన్నగును సాంబ. ౪

టీ. మూవ, మూఁగ, మూఁగి-౩=మూకుఁడు. గ్రుడ్డి, చీకు - ౨ = అంధకుఁడు. పరువము, ప్రాయము॥రూ॥పాయము, వయసు [ఇది సంస్కృతసమము], జవ్వనము=[ప్ర.] యౌవనము-౫ = యౌవనము. అందగాఁడు, వగకాఁడు, అమరువాఁడు, వన్నెకాఁడు, ఎమ్మెకాఁడు, జౌనుకాఁడు = హౌసుగలవాఁడు, సొగసైనవాఁడు, నీటుకాఁడు-౭ శృంగారవంతుఁడు. గోవాళ్లు=యౌవనముగలవాఁడు, బొజుఁగు, కోడెకాఁడు, వెచ్చకాఁడు=వెచ్చమునిచ్చువాఁడు, ననుపుకాఁడు = అనురాగము గలవాఁడు, వేడ్కకాఁడు, లంజెకాఁడు=లంజెగలవాఁడు, మిండఁడు - ౮ = విటుఁడు. సోయగము, చక్కఁదనము, సొబగు, రూపు - ౪ = సౌందర్యము.

సీ. గట్టిమనసువాఁడు గడుసరి యుక్కరి
దిటవరి దిట్టన ధీరున కగుఁ

కుచ్చితుఁ డడిగొట్టు కూళ పెంకె బికారి
ముడికాఁడు చిలుమువాల్ మోటు లుచ్చ
చెండిపోతు గరాసు మొండికట్టె తులువ
కైలాటకాఁడు టక్కరి పిసాళి
టకటొంకు టాటోటు తవళి దబ్బలి దూబ
గడుసు కల్లరి దోసకారి చెనఁటి
తే. పాలసుఁడు లండి పిక్కరి పలువ చెడుగు
బేరజ మనంగ ధూర్తునిపేరు లమరుఁ
బగఱు మార్తురు పగతురు పవతు రనఁగ
నహితులకు నామధేయము లమరు సాంబ. 9

టీ. గట్టిమనసువాఁడు, గడుసరి, ఉక్కరి=శౌర్యముగలవాఁడు, దిట
వరి=వెనుదీయనివాఁడు, దిట్ట - 4=ధీరుఁడు. కుచ్చితుఁడు=[ప్ర.] కుత్సితుఁ
డు, అడిగొట్టు, కూళ, పెంకె, బికారి, ముడికాఁడు, చిలుమువాఁడు,
మోటు, లుచ్చ, చెండిపోతు, గరాసు, మొండికట్టె, తులువ, కైలాట
కాఁడు=జగడమాడువాఁడు, టక్కరి, పిసాళి, టకటొంకు, టాటోటు॥రూ॥
తాటోటు, తవిళి ॥రూ॥ తవళి, దబ్బలి, దూబ, గడుసు, కల్లరి = అబద్ధము
లాడువాఁడు, దోసకారి=దుష్కార్యములు సేయువాఁడు, చెనఁటి, పాల
సుఁడు, లండి, పిక్కరి=వంచనగలవాఁడు, పలువ, చెడుగు, బేరజము-33=
ధూర్తుఁడు. పగఱు, మార్తురు, పగతురు, పవతురు - 4=శత్రువులు.

సీ. వెలివారు కడవారు వింతవా రెడవారు
లాఁతివా రన నన్యులకుఁ జెలంగుఁ
జుట్టలు చుట్టాలు చుట్టముల్ విందులు
గెల్లు బంధువులకుఁ

గూర్చువాఁ డెడకాఁడు కుంటెనకాఁ డనఁ
    దాపికాఁ డనఁ బేరు దనరుచుండు
విటుదూత బయకాఁడు వీణెకాఁ డనఁ బొల్చు
    వైణికునకు గాణ పాటకుఁ డన
తే. గాయకుని కగుఁ దిక్క వెంగలి వెడంగు
వెకలి వీటఁడి వెంబరవిత్తు వెఱ్ఱి
వేఁదు అనఁగ నపస్మారివెలయుఁ జెవిటి
విననివాఁ డన బధిరాఖ్య లొనరు సాంబ. 10

టీ. పెఱవారు, కడవారు, వింతవారు, ఎడవారు, లాఁతివారు-౫= అన్యులు. చుట్టలు, చుట్టాలు, చుట్టములు, విందులు, బందుగులు [ప్ర.] బంధువులు - ౬=బంధువులు, కూర్చువాఁడు, ఎడకాఁడు, కుంటెనకాఁడు, దాపికాఁడు - ౪=విటునిదూత-విటీవిటులను కూర్చువాఁడు, బయకాఁడు, వీణెకాఁడు - ౨=వైణికుఁడు. గాణ, పాటకుఁడు - ౨=గాయకుఁడు. తిక్క, వెంగలి, వెడఁగు, వెకలి, వీటఁడి, వెంబరవిత్తు, వెఱ్ఱి, వేఁదులు - ౮=అపస్మారి. చెవిటి, విననివాఁడు - ౨ = బధిరుఁడు.

సీ. ఎకిమీఁడు పాదుసా యేలిక మన్నీఁడు
    సాహేబు రాయఁడు సామి ప్రభువు
జియ్యు తుపాసి వజీరుండు రాయలు
    దునెదారి రాజేఁడు దొర యొడయఁడు
నేఁ డన వర్తిల్లు నృపుపేళ్లు పడవాలు
    దళవాయి దళ్వాయి దణి యనంగఁ
దగు దళకర్తకుఁ దగువాఁడు వెరవరి
    తీర్పరి కార్బారి దిట్ట యనఁగఁ
తే. గార్యకర్తకుఁ జెలగుఁ బ్రెగ్గడ నిజోగి

ప్రెగడ మంతిరి నా మంత్రిపేళ్లు వెలయుఁ
బంగునకు లేవఁజాలనివాఁడు పుట్టు
మొండి పిచ్చుకుంటను పేళ్లు పొసఁగు సాంబ. 11

టీ. ఏకిమీఁడు, పాదుసా.(ఇది తురకపదము) ॥రూ॥ పాదుసాహి, ఏలిక, మన్నీఁడు ॥పా॥ మన్నియ ॥రూ॥ మన్నియఁడు-మన్నెఁడు,మన్నె, సాహేబు (ఇది తురకపదము), రాయఁడు, సామి (ప్ర. స్వామి), పబువు (ప్ర. ప్రభువు), జీయ్య, తుపాసి, వజీరుఁడు, (ఇదితురకపదము) ॥రూ॥ వజీరుఁడు, వ్రజీఁడు, రాయలు, దునెదారి ॥రూ॥ దునేదారి, రా, ఱేఁడు, దొర, ఒడయఁడు, నేఁడు-౨౬=రాజు. పడవాలు, దళవాయి, దళ్వాయి, దణి-౪ = సేనాధిపతి. తగువాఁడు, వెరవరి (వెరవు×అరి) = ఉపాయ మెఱిఁగినవాఁడు, తీర్పరి, కార్యాబరి, దిట్ట-౫=కార్యసమర్థుఁడు. ప్రెగ్గడ, నియోగి (ప్ర. నియోగి), ప్రెగడ ॥రూ॥ పెగడ, మంతిరి - ౫ = మంత్రి. లేవఁజాలనివాఁడు, పుట్టుమొండి, పిచ్చుకుంటు ॥రూ॥ పిచ్చుకకుంటు-పిచ్చికుంటు - పిచ్చికకుంటు-౬=కాళ్లులేనివాఁడు.

సీ. ఎడకాఁడు కొల్లగాఁ డెడ్డుతోవకాపరి
గడిదొంగ దోఁపుడుకాఁడు నాఁచు
గజముచ్చు చేవాఁడికాఁడు జాజరకాఁడు
మచ్చరి మునిముచ్చు మాయదారి
తెరువాటుకాఁడు కత్తెరదొంగ దొరకోలు
సన్యాసి వడికాఁడు కన్నగాఁడు
రేద్రిమ్మరీఁడు ము ల్లియవిప్పు లోవాఁడి
కాఁడు తెక్కలికాఁడు కల్లరీఁడు
తే. తవిలి పోసరి యనఁ జెల్లుఁ దస్కరునకుఁ
దొత్తు సాఁకుడు బోనముకత్తె దాది

విలువరమ్మున్నాడు వరవుఁ డిల్ల్ బిడ్డ యనఁగ
దాసికానామధేయముల్ దనరు సాంబ. 12

టీ॰ ఎడకాఁడు, కొల్లగాఁడు, ఎడత్రోవకాపరి=నడిదారినికాచికొని యుండువాఁడు, గడిదొంగ=ఒళవెటిఁగినదొంగ, దోఁపుడుకాఁడు॥రూ॥ దోఁపిడికాఁడు-దోఁపుకాఁడు, నాఁచు, గజముచ్చు=పెద్దదొంగ, చేవాఁడికాఁడు=చేతులచే క్రూరత్వమును జూపువాఁడు, జాజరకాఁడు॥రూ॥జజ్జరకాఁడు=మోసము గలవాఁడు, మచ్చరి(ప్ర. మత్సరి), మునిముచ్చు=మునివేషముతో నమ్మించిదొంగిలించువాఁడు, మాయదారి=మాయలుగలవాఁడు, తెరువాటుకాఁడు=బందికట్టికొట్టువాఁడు, కత్తెరదొంగ=కత్తిరించువాఁడు, దొరకోలుసన్నాసి=నమ్మించి మోసపుచ్చిదొంగిలించుకొని పోవువాఁడు, ఐడికాఁడు=చులుకఁదనముగలవాఁడు, కన్నగాఁడు=కన్నముపెట్టువాఁడు, రేద్రిమ్మరీఁడు=దొంగిలించుటకు రాత్రులందుఁదిరుగువాఁడు, ముల్లియవిప్పు=సొమ్ముముడినివిప్పువాఁడు, లోవాఁడికాఁడు = పైకి మెత్తనివాఁడుగాఁ దోఁచి లోపలఁ గ్రూరత్వము గలిగియుండువాఁడు, తెక్కలికాఁడు, కల్లరీఁడు (కల్ల+అరి+ఈఁడు), తవలి ॥రూ॥ రవళి, మోసరి [మోసము+అరి]-అరా=దొంగ. తొత్తు, సాకుడు, బోనముకత్తె, ॥రూ॥ బోనకత్తె, దాది [ప్ర. ధాత్రి], విలువరమ్ముడు వరవుఁడు, ఇలుబిడ్డ-లు=దాసి.

సీ. వడుపుఁజాన గడించు పడఁతి మేల్దాపరి
బోగపుఁజేడియ పొత్తుటాలు
వేడుకచెలి లంజె వెలయాలు రోచెల్వ
వెల్లాటకత్తె నా వేశ్య వెలయుఁ
గూర్చియిచ్చుమిటారి కుంటెనకత్తియ
తాపికత్తె యనంగఁ దనరు దూతి
నాగవాసం బన నామ మా వేశ్యల

మేళంబునకుఁ గొమరాలు కొమిరె

తే. చామ జవరాలు కొమరిత ✱ జవ్వని యన
సుందరికిఁ జెల్లు గట్టివై ✱ సుదియుఁ బ్రోడ
యనఁగఁ దగుఁ బ్రౌఢ వయసు ✱ చెల్లినది ముసలి
మిండకోరన లోలాఖ్య ✱ మెఱయు సాంబ. 13

టీ. పడుపుఁజాన [పడుపు+చాన]=ఆర్జనముగల స్త్రీ), గడించుపడఁతి=ఆర్జించు స్త్రీ), మేల్దాపరి, భోగపుఁజేడియ [భోగము+చేడియ], పొత్తుటాలు [పొత్తు+ఆలు], వేడుకచెలి=విలాసార్థమైన స్త్రీ), లంజె, వెలయాలు [వెల+ఆలు]=క్రయమునకుభార్యగా నిచ్చెడి స్త్రీ), రొకచెల్వ=ద్రవ్యమునకు వచ్చెడు స్త్రీ), వెల్లాటకత్తె=మిక్కిలి నాట్యమాడు స్త్రీ)-౧౦=వేశ్య. కూర్చి యిచ్చుమిటారి, కుంటెనకత్తె, తాపికత్తె-౩=దూతిక. నాగవాసము=వేశ్యలసమూహము. కొమరాలు, కొమిరె=లేఁతవయస్సుగలది. చామ, జవరాలు=యౌవనముగలది. కొమరిత॥రూ॥ కొమారిత-కొమార్త, జవ్వని[జవ్వనము+ఇ]=యౌవనముగలది-౮=ప్రాయముగల స్త్రీ), గట్టివైసుది, ప్రోడ [ప్ర. ప్రౌఢ]-౨=ప్రౌఢ స్త్రీ) వయస్సుచెల్లినది, ముసలి, మిండకోరి ॥రూ॥మిండలకోరి-౪=లోల స్త్రీ).

సీ. కన్నియ కన్నె నా ✱ కన్యక కగుఁ బేరు
లాసగలది అంకు ✱ లాడి చెడిపె
వెలిచారవరి యన ✱ వెలయు జారిణి పేళ్లు
మెయి మేయి యొడలు నె ✱ మ్మేను మేను
బొంది మే నై యనఁ ✱ బొసఁగు దేహమునకు
నెఱకలు వెంట్రుకల్ ✱ నెఱు లనఁగఁ
గేశసమాఖ్య లౌఁ ✱ గేశబంధము పేళ్లు
కీల్ముడి క్రొమ్ముడి ✱ కీలుగంటు

తే. నూనెముడి వెన్నుగంటన ♦ నొనరు శిఖకు
జుట్టు సిక సిగ యనఁ జెల్లుఁ ♦ జుంచు కురులు
ముంగురులు కూఁకటు లనఁగఁ ♦ బొసఁగు చుండుఁ
గుంతలములకు జితదైత్యకూట సాంబ. 14

టీ. కన్నియ, కన్నె (ప. కన్య)-౨=కన్య. అసగఱది, ఱఁకులాఁడి, చెడిపె, వెలిచొరవరి=బయటిచొరవగలది-౪=జారిణి. మెయి, మేయి, ఒడలు, నెమ్మేను, మేను, బొంది, మే, మై-౮=దేహము. నెఱకలు, వెండ్రుకలు, నెఱులు ॥రూ॥ నెరులు-౪=కేశములు. కీల్ముడి, క్రొమ్ముడి (క్రొత్త+ముడి)(ఇది 'కుఱుముడి' కిఁగలిగిన 'క్రుమ్ముడి' యని'యనికొన్ని ప్రయోగములఁజూపట్టుచున్నది.)! కీలుగంటు, నూనెముడి, వెన్నగంటు-౫=కేశబంధము-అనఁగా జాలుగా ముడిఁచిన వెండ్రుకల దూముడి. జుట్టు, సిగ, సిక-౩=శిఖ*చుంచు, కురులు, ముంగురులు (మున్ను+కురులు), కూఁకటులు-౪=కుంతలములు-అనఁగా పొడివెండ్రుకలు.

సీ. కొప్పు వేనలి మూల ♦ క్రొవ్వెద తుఱుము మనఁ
గబరి యాకఁ గను ♦ కన్ననంగ
నేత్రాఖ్య లగు నొసల్ ♦ నెన్నొసల్ నుదురు నె
న్నుదు రన నిటలాఖ్య ♦ లొదవుఁ జూడ్కి
పొరువ దిష్టి చూ ♦ పన వీక్షణము లొప్పు
వీనులు చెవులును ♦ జానుగులును
నా నొప్పు శ్రోత్రముల్ ♦ కాను లేఁగౌను నె
న్నడుము నడు మనంగ ♦ నడరు మధ్య
తే. మునకుఁ బొక్కిలి బొడ్డనఁ ♦ దనరు నాభి

* చుంచు, కూఁకటులు. ఈరెండు శబ్దములును కుంతలపర్యాయము లగుట విచార్యము.

మూతి మోర మొకము మోము మొగ మనంగ
వదనము దనర్చు వా నోరు వాయి యనఁగ
ముఖమహాభిఖ్య లగు గురుమూర్తిసాంబ. 15

టీ. కొప్పు, వేనలి, మూల, క్రొవ్వెద (క్రొత్త+వెద), తుఱుము-౫=కొప్పు. కఁ, కను, కన్ను-౩=నేత్రము. నాసలు, నెన్నొసలు, నుదురు, నెన్నుదురు-౪=నిటలము. చూడ్కి, పారువ (అఱవపదము), దిష్టి (ప్ర.దృష్టి), చూపు-౪=దృష్టి. వీనులు, చెవులు, ఆనుగులు-౩=కర్ణములు. కౌను ||సూ|| కవును, లేఁగౌను [లేఁత+కౌఁను], నెన్నడుము (నెఱ+నడుము), నడుము-౫=మధ్యము. పొక్కిలి, బొడ్డు-౨=నాభి. మూతి, మోర, మొకము, మోము, మొఁగము [ఈ ౩ కి ప్ర. ముఖము]-౫=ముఖము. వా, నోరు, వాయి-౩=నోరు.

సీ. పలు పల్లు పండులు పండ్లన రదములౌఁ
జెంప దవడ చెక్కు చెక్కి లనఁగఁ
దగుఁ గపోలము నెత్తి తల యన శిర మొప్పు
ముకు ము క్కనంగ నాసిక చెలంగు
బొమ కనుబొమ యన భ్రూనామ మమరు మీ
సలు మీసము లనంగ శ్మశ్రు వలరు
నదరము కెమ్మోవి పెదవి వాతెఱ మోవి
యన నోష్ఠ మగు నెద యక్కు ఱొమ్ము
తే. నెడఁద యన వక్షమగుఁ బొట్ట కడుపు బొజ్జ
బొఱ్ఱ డొక్కన నుదరంబు పొసఁగుచుండుఁ
గేలు కై కయి చేయి కెంగే లనంగఁ
బంచశాఖకు నామముల్ పరఁగు సాంబ. 16

టీ. పలు, సం పండులు, పండ్లు-౪=దంతములు. చెంప ||పా||

చెంక, దవడ, చెక్కు, చెక్కిలి - ౫=కపోలము. నెత్తి, తల-౨=శిరము, ముకు, ముక్కు - ౨=నాసికము. బొమ, కనుబొమ - ౨=భ్రూలత. మీసలు, మీసములు - ౨=శ్మశ్రువులు. అదరము (ప్ర॰ అధరము), కెమ్మోవి (కెంపు+మోవి), పెదవి,వాతెఱ (వాయి×తెర), మోవి-౫=ఓష్ఠము. ఎద, అక్కు, అఱ్ఱు, ఎడఁద - ౪=వక్షము. పొట్ట, కడుపు, బొజ్జ, బొట్ట, డొక్క-౫=ఉదరము. కేలు (నిత్యైకవచనాంతము), కై, కయి, చేయి॥రూ॥ చెయి, చెయ్యి, చే, కెంగేలు (కెంపు+కేలు) - ౮=హస్తము.

సీ. అఱచెయ్యి లోచెయి కయనఁ గరతల మొప్పఁ
బెడచెయ్యి మీఁజెయి వెనుక చెయ్యి
యనఁ దగుఁ జరమశయంబు వేల్ వ్రేలన
నంగుళి యగుఁ జరమాంగమునకు
వెన్ను వెనుకమేను వీఁపన వర్తిల్లు
గద్దువ గడ్డము గౌద యనఁగఁ
జిబుకనామంబు రాజిల్లుఁ గడవసంబు
చట్ట తోలనఁ గళాసంబు నాఁగఁ
తే. జర్మ మమరు మోఁకాళ్లన జానువు లగుఁ
బిక్క చిఱుదొడ యన జంఘపేళ్లు దనరుఁ
గుఱువు తొడ యన నూరువు వఱలు ముడ్డి
పిఱుదుఁ తుంటన జఘనంబుపేళ్లు సాంబ.  17

టీ. అఱచెయ్యి, లోచెయి- ౨=కరతలము. పెడచెయ్యి, మీఁజెయి (మీఁదు+చెయి), వెనుకచెయ్యి-౩=హస్తచరమభాగము. వేలు,వ్రేలు-౨= అంగుళి. వెన్ను, వెనుకమేను వీఁపు - ౩ = పృష్ఠము. గద్దువ, గడ్డము. గౌద ॥రూ॥ గవుద - ౪=చిబుకము. కడవసము, చట్ట, తోలు, కళాసము- ౪=చర్మము. మోఁకాళ్లు=జానువులు, పిక్క, చిఱుదొడ - ౨ = జంఘ

కుఱువు, తొడ-౨=ఊరువు. ముడ్డి॥రూ॥ మూడి, పిఱుఁదు, తుంటి-౪=కటి.

సీ. పునుక పుఱియ పుచ్చె ౹ యనఁ గపాలం బొప్పు
బుజము మూఁ పనఁ జెల్లు ౹ భుజము పేళ్లు
బట్ట వలువ కోక ౹ పుట్టంబు గింటెంబు
చీర నా వసనంబు ౹ చెలఁగు నఱుత
గొంతు కుత్తుక యఱ్ఱు ౹ కొలిమి మెడ యనంగ
గళమున కగుఁ బిడికిలి లన ముష్టి
కగుఁ బ్రసృతికిఁ జేర ౹ యన నంజలికి దోయి
లన హస్తమునకు మూ ౹ రనఁగఁ బొసఁగు

తే. బార యనఁగను వ్యామాఖ్య ౹ పరఁగు జేన
దుత్త యనఁ దాలమున కొప్పు ౹ బెత్త యనఁగ
నంగుళాభిఖ్య యగు నంజ ౹ హజ్జ యడుగు
నాఁగఁ బాదాఖ్య లగు లోక ౹ నాథ సాంబ. 18

టీ. పునుక, పుఱియ॥రూ॥ పుఱ్ఱియ - పుఱ్ఱె, పుచ్చె - ౫ = కపాలము. బుజము, మూఁపు-౨=భుజము. బట్ట, వలువ, కోక, పుట్టము, గింటెము॥ చీర-౬=వస్త్రము. అఱుత, గొంతు, కుత్తుక, అఱ్ఱు, కొలిమి, మెడ-౬=కంఠము. పిడికిలి=ముష్టి. చేర=ప్రసృతి [పుడిసిలి-చాఁచిన వ్రేళ్లుగల అఱచేయి]. దోయిలి॥రూ॥ దోసిలి-౨=అంజలి. మూర=హస్తము. [మోచేతి మొదలు వ్రేళ్లకొనవఱకుఁ గలభాగము]. బార=వ్యామము [రెండు చేతులు చాఁపఁగా నడుమఁగలసందు]. జేన, దుత్త-౨=తాలము [చాఁచినబొటనవ్రేలికొనకు చిటికెనవ్రేలికిని నడుమనుండుసందు]. బెత్త=అంగుళము. అంజ, హజ్జ॥రూ॥ అజ్జ, అడుగు-౩=పాదము.

సీ. చనులు గుబ్బలు చండ్లు ౹ చాచులు పాలిండ్లు

చన్ను లనంగఁ గుబ్బచంబు లమరు
నారు నూఁగారన న్నలరు రోమావళి
పాపలఁ గనుతావు పత్త్ర బుయ్య
మరునిల్లు దుబ్బన మదనమందిర మొప్పుఁ
బిల్లలఁ గలిగించువేరు చుల్లి
బుల్ల బెల్లమనంగఁ బొసఁగు శేఫము గాఁడు
గుద్ద పిఱ్ఱి యనంగ గుదము దనరు
తే. పైఁట పయ్యఁట పయ్యెద పయ్యఁట చెఱఁగు
నాఁగఁ జేలాంచలాభిధానంబు దెలఁగుఁ
గలువడము చందువా మేలుకట్టనంగ
నతిశయిల్లు వితానాహ్వయములు సాంబ. ౧౯

టీ. చనులు, గుబ్బలు, చండ్లు, చాచులు, పాలిండ్లు, చన్నులు-౬=స్తనములు. ఆరు. నూఁగారు-౨=నాభిక్రిందిరోమావళి-పాపలఁగనుతావు=బిడ్డలను గనునట్టిచోటు, పత్త్ర, బుయ్య, మరునిల్లు=మన్మథునిగృహము, దుబ్బ-౫=మన్మథగృహము (ఆఁడుగుఱి). పిల్లలఁ గలిగించువేరు=బిడ్డలను బుట్టించుటకు మూలభూతమైనది, చుల్లి ॥రూ॥ చుల్ల, బుల్ల, బెల్లము-౪=శిశ్నము. గాఁడు, గుద్ద, పిఱ్ఱి-౩=గుదము. పైఁట, పయ్యఁట, పయ్యెద ॥రూ॥ పయ్యద, పయఁట, చెఱఁగు-౬=వస్త్రాంచలము (చీరకొంగు). కలువడము, చందువా, మేలుకట్టు-౩=వితానము.

సీ. చెలి ముద్దుగుమ్మ యుగ్మలి నవలా చాన
కన్నె బిత్తరి గోతి కలికి మగువ
జవరాలు చేడియ జవ్వని తొయ్యలి
నాతి పైదలి యెలనాఁగ లేమ
నకియ జక్కవచంటి చామ చిల్కలకొల్కి

గుబ్బెత ప్రోయాలు కొమ్మ పడంతి
పొలంతి ముద్దియ ననంబోండి యింతి మిటారి
నెలంతుక వాల్గంటి నెలంత తెఱవ
తే. యన్ను లతకూన యొయ్యారి యతివ వెలంది
చెలియ సకి బోటి కొమరిత చిగురుంబోండి
ముగుద వగలాండి సింగారి ముదిత యువిద
గరిత యన భామినీసమాఖ్య లగు సాంబ. 20

టీ. చెలి, ముద్దుగుమ్మ=మనోజ్ఞురాలైనది, ఉగ్మలి, చపలా, చాన, కన్నె ॥రూ॥ కన్నియ, బిత్తరి=శృంగారచేష్టగలది, గోతి, కలికి=మనోజ్ఞురాలైనది, మగువ, జవరాలు=యౌవనము గలది, చేడియ, జవ్వని=యౌవనము గలది, తొయ్యలి, నాతి, పైదలి, ॥రూ॥ పయిదలి, ఎలనాఁగ, లేమ, సకియ, జక్కవచంటి=జక్కవపక్షులవంటి స్తనములు గలది, చామ, చిలుకలకొలికి=చిలుకలకొలికివంటి కొలుకులుగలది, గుబ్బెత=గుబ్బచన్నులుగలది, ప్రోయాలు, కొమ్మ, పడఁతి, పొలఁతి ॥రూ॥ పొల్తి, ముద్దియ, ననఁబోఁడి=పువ్వువలె మెత్తనిదేహము గలది, ఇంతి, మిటారి=మిటారము గలది, నెలఁతుక, వాల్గంటి=నిడుదలైన కన్నులు గలది, నెలఁత, తెఱవ, అన్ను, లతకూన=లేఁతతీఁగవంటిది, ఒయ్యారి=ఒయ్యారముకలది, అతివ, వెలఁది ॥రూ॥ వెలఁదుక, చెలియ, సకి, బోటి, కొమరిత, చిగురుఁబోఁడి=చిగురువలె మృదువైనశరీరముగలది, ముగుద, వగలాఁడి=చిన్నెలుగలది, సింగారి=శృంగారము గలది, ముదిత, ఉవిద, గరిత-౫౮=స్త్రీ.

సీ. ఆనవాలు(ను)పులు గంగమచ్చము గుఱు
తడియాల మన లాంఛనాఖ్య లొందవు
జడితి గొబ్బున వేగ సరగు గ్రిక్కున వడి
వేగిర మనఁ దగు వేగమునకు

మరియాద గడి మేర ♦ సరు దెల్ల కర యనఁ
బరఁగు మర్యాదకు ♦ వెఱఁగు వింత
యక్కజ మబ్బుర ♦ మరిది నివ్వెఱ యబ్ర
మచ్చెరు వన నద్భుతాఖ్య లమరుఁ
తే. బరుగు కదలిక పరు వన ♦ మెఱయు ధావ
నమ్మునకు వేడెమొనరించెఁ ♦ గ్రమ్మెఁ బొదివెఁ
జుట్టుకొనె నావరించె నా ♦ నిట్టినుడులు
వేష్టనంబున కమరు సర్వేశ సాంబ. 21

టీ. ఆనవాలు, పులుగు, అంగమచ్చము, గుఱుతు, అడియాలము-౫=లాంఛనము. జడితి [ప్ర. ఝటితి], గొబ్బునన్, వేగ, సరగు, గ్రక్కునన్ పడి, వేగిరము-౮=వేగము. మరియాద, గడి, మేర, సరుదు, ఎల్ల, కర-౬=మర్యాద, [హద్దు] వెఱఁగు, వింత, అక్కజము, అబ్బురము, అరిది, నివ్వెఱ [నిండు+వెఱ], అబ్రము, అచ్చెరువు [ప్ర. ఆశ్చర్యము]-౮=అద్భుతము. పరుగు, కదలిక, పరువు-3=ధావనము [పరుగెత్తుట]. వేడెమొనరించె, క్రమ్మె, పొదివె, చుట్టుకొనె, ఆవరించె-౫=పరివేష్టించెను.

సీ. బువ్వ మెతుకు కూడు ♦ బోన మోరెము పసా
దము వంటకము పసాదనము బొత్తు
సాద మోగిర మన ♦ జరుగు నన్నము పేళ్లు
కుడిచె బోసేసె సాపడియె నమలె
నారోగిణ మొనర్చె ♦ నారగించె మెసవెఁ
దినె మెక్కె నన భుక్తిగొనుట కలరుఁ
బనులు చెయ్యులు సేఁత ♦ లనఁ గర్మముల కొప్పుఁ
గనలు మోడి యలుక ♦ కినుక కిన్క
తే. నాఁగఁ గోపాఖ్య లగు లజ్జ ♦ నాన సిగ్గు

బొసుకు పుయిలోట సిబ్బితి ఽ పుచ్చటి కనఁ
బరఁగు వ్రీడాఖ్య యోల నెపంబు సాక
నంగ వ్యాజం బమరు జగన్నాథ సాంబ. 22

టీ. బువ్వ, మెతుకు, కూడు, బోనము, ఓరెము, పసాదము. [ప్ర- ప్రసాదము], వంటకము, పసదనము, బాతు [అన్యదేశ్యము], సాదము[ఇది అపపదము], ఓగిరము-౧౧=అన్నము. కుడిచె, బోసేసె, సాపడియె, నమ లె, ఆరోగిణమొనర్చె, ఆరగించె, మెసవె॥రూ॥ మెసఁగె, తినె, మెక్కె- ౧౦=భుజించెను. పనులు, చెయ్వులు, చేఁతలు-౩=కృత్యములు. కనలు, మోడి, అలుక ॥రూ॥ అల్క, కినుక, కిన్క-౭=కోపము. లజ్జ, నాన, సిగ్గు, బొసుకు-పుయిలోట, సిబ్బితి, పుచ్చటిక ॥రూ॥ పుచ్చడీక-౮=లజ్జ, ఓల, నెపము ॥రూ॥ నెవము [ప్ర. నిభము], సాకు-౩=వ్యాజము.

సీ. పానుపు తలిమంబు ఽ పఱుపు లే పన మెత్త
సెజ్జ యనఁగ శయ్య ఽ చెలఁగు చుండుఁ
బన్నుండెఁ దెన్నుండెఁ ఽ బండుకొనెఁ బరుండెఁ
బవ్వళించెను బండెఁ ఽ బడకసేసె
నత్తముల్లె ననంగ ఽ నలరారు శయనించె
ననుటకు నిద్దురకొనియె గుఱక
గొనియె నిద్దుర వోయెఁ ఽ గూర్కెడె నన నిద్రి
తున కొప్పు లేచె మేల్కొనియె మెలఁకు
తే. వయ్యె నన జాగ్రదభిధాన ఽ మమరు వేడ్క
యెలమి వేడుక సంతోస ఽ మింపు ముదము
సంతసము సొంపు మే లరుసం బనంగఁ
బ్రిమదమున కాఖ్య లగు జగన్నాథ సాంబ. 23

టీ. పానుపు ॥రూ॥ పాన్పు, తలిమము, పఱుపు, లేపు, మెత్త,

సెజ్జ [ప్ర. శయ్య] -౨=శయ్య. పన్నుండె, తెన్నుండె॥పా॥తొన్నుండె, పండుకొనె, పరుండె, పవ్వళించెను, పండె, పడకసేసె, అత్తమిల్లె-౯=శయనించెను. నిద్దురగొనియె ॥రూ॥ నిదురగొనియె, గుఱుకగొనియె, నిద్దురవోయె, గుర్కిడె - ౫=నిద్రించెను. లేచె, మేల్కాంచె ॥పా॥ మేల్కనె, మెలఁకువయ్యె - ప్రజాగరూకుఁడయ్యెను [ప్రబోధమందెను]. వేడ్క, ఎలమి, వేడుక, సంతోసము, ఇంపు, ముదము, సంతసము, సొంపు, మేలు, అరుసము-౧౦=సంతోషము.

సీ. పలికె వాఁడ్రుచ్చె నప్పన సేసె మండలి
ంచెను విన్నవించెఁ జెప్పె ననె నొడివె
నాడెఁ బల్కె వచించె నన భాషణముసేసె
ననుట కా వీనిచ్చె నాలకించె
వినెఁ జెవియొగ్గెను వినియె నాలించె నా
శ్రుతమయ్యె ననుట కాఁ జులుక చౌక
యులక యెల్లిద మన నొనరు లఘుతపేళ్లు
పులకలొత్తెను గగుర్పొడిచె గగురు
తే. పాటె గరుపాటె మైమోజుపర్వె ననఁగఁ
దగును రోమాంచనామముల్ నగవు నవ్వు
నగు నవన హాసమున కొప్పు నడిమిదిన్నె
దీవి యన ద్వీప మగుఁ బరదేవ సాంబ. 24

టీ. పలికె, నాఁడ్రుచ్చె, అప్పనసేసె [ప్ర. అర్పణచేసెను],మండలించె, విన్నవించె, చెప్పె, అనెను, నొడివె, ఆడె, పల్కె, వచించె-౧౧ = సంభాషించెను. వీనిచ్చె,ఆలకించె, వినె, చెవియొగ్గె, వినియె, ఆలించె-౬= వినెను, చులుక ॥రూ॥ చుల్క,చౌక ॥రూ॥ చవుక, ఉలక, ఎల్లిదము-౬= లఘుత్వము. పులకలొత్తెను,గగుర్పొడిచె॥రూ॥గగురుపొడిచె,గగ్గురుపొడిచె,

గగురుపాటు, గరుపాటు, మైమోజుపర్వె - ఠ=రోమాంచమయ్యె. నగవు, నవ్వు, నగు, నవు-ర=హాసము. నడిమిదిన్నె, దీవి-౨=ద్వీపము.

సీ. జోత చాఁగిలి కొల్పు కి జోహారు గిడిగిడి
మోడుపు చేకూర్పు కి మొ్రొక్కు మొగుపు
చిన్నిపూ చేమోడ్పు కి జేజె వెన్నెల చెంగ
నాలు గొబ్బులు టెంకణాలు నేరె
డల్లుల్ సలా మన కి నమరు దండముపేళ్లు
పళ్లెము కంచము కి పళ్లెరంబు
తెలె హరివాణంబు కి తలియ తట్టె యనంగ
భాజనం బగుగిన్నె కి బటుది కోర
తే. డబ్బర యనంగఁ జషక మా కి డప్పి దూప
దప్పి దగ నీరువట్టన కి దాహ మమరుఁ
జాగ మీవి పుడుకు పెట్టు కి తేగ మీగి
యనఁగఁ ద్యాగసమాభిఖ్య కి యగును సాంబ. 25

టీ. జోత ॥రూ॥ జోతము, చాఁగిలి, కొల్పు, జోహారు ॥రూ॥ జోహారువు-జొహారు-జొహారువు, గిడిగిడి, మోడుపు ॥రూ॥ మోడ్పు, చేకూర్పు, ్రమొక్కు, మొగుపు, చిన్నిపూ, చేమోడ్పు, జేజె, వెన్నెల, చెంగనాలు, గొబ్బులు, టెంకణాలు, నేరెడల్లులు, సలాము [ఇది అన్యదేశ్యము] -౨౩=నమస్కారము. పళ్లెము॥ రూ॥ పళ్యెము, కంచము, పళ్లెరము, తెలె॥ రూ॥ తెలియు, హరివాణము.తలియ,తట్టె-౯=పాత్రము. గిన్నె, బటుది, కోర, డబ్బర॥ రూ॥ దబ్బర-౫=చషకము, డప్పి, దూప, దప్పి, నీరువట్టు-ర=దాహము. చాగము, ఈవి, పుడుకు, పెట్టు, తేగము, ఈగి-౬= త్యాగము.

సీ. అగపడెఁ జేపడె కి నబ్బె దొరకెఁ జిక్కెఁ

దగిలెఁ దగుల్కొనెఁ దగులువడియెఁ
బట్టువడియెఁ జిక్కువడెఁ దవిలె ననంగ
నమరు గృహీతాఖ్య లఱచె నేడ్చె
వాపోయె మొఱలిడె వాచఱచె ననంగ
రోదనంబున కగు రొద గలిబిలి
చప్పుడు గోలగోల సద్దు కూఁత యులివు
నలుకుఁడు రవళి ఱంతనఁగ ధ్వనికి
[illegible]రుఁ గలసె బెరసెఁ గూడె హత్తె దొరసె
నందెఁ బొందెఁ బెనఁగెఁ జెందె నంటె ననఁగ
నమరు సక్తాఖ్య లోనయ్యె నగ్గమయ్యె
లోపడె ననంగ స్వవశాఖ్యలు చను సాంబ. 26

టీ. అగపడెన్ (అగ్గము+పడెను), చేపడె, అబ్బె, దొరకె, చిక్కె, తగిలె, తగులుకొనె, తగులువడె, పట్టువడె, తవిలె-౧౦=గృహీతుఁడయ్యె. అఱచె, ఏడ్చె, వాపోయె, మొఱలిడె, వాచఱచె-౫=రోదనముచేసె. రొద, గలిబిలి, చప్పుడు, గోలగోల, సద్దు, కూఁత, ఉలివు, నలుకుఁడు, రవళి॥ రూ॥ రవాళి, ఱంతు-౧౧=ధ్వని. కలసె, బెరసె, కూడె, హత్తె, అందె, పొందె, పెనఁగె, చెందె, అంటె-౧౦=సక్తమయ్యె. లోనయ్యెను, అగ్గమయ్యెను, లోపడెను-౩=స్వవశమయ్యెను.

సీ. ఎడసె వీడెను బాసె నెడఁబాసెఁ బురివిచ్చె
వేఱువడె ననంగ వెలయుచుండుఁ
బ్రత్యేకమయ్యె నన్ పలుకులు వెడలించె
వెళ్లఁగొట్టెను దోలె వెలలఁబన్నెఁ
దఱిమె రొప్పె ననంగఁ దనరు నుచ్చాటనం
బొనరించె ననుటకుఁ గనియెఁ జూచెఁ

గనుఁగొనెఁ దిలకించెఁ గనెఁ గాంచె ననఁ జెల్లు
దర్శించె ననుటకుఁ దాల్చెఁ బూనె
తే. నానె మోచె ననఁగఁ జెల్లు నధివహించె
ననుట కరికట్టెఁ బోనీక యంకెచేసె
నాఁగె నిల్పెఁ దటాయించె నడ్డగించె
నానుకొనె ననఁ దగు వారణాఖ్య సాంబ. 27

టీ. ఎడసె, వీడెను, పాసె, ఎడఁబాసె, పురివిచ్చె, వేఱుపడె-౬=ప్రత్యేకమయ్యెను. వెడలించె, వెళ్లఁగొట్టె, తోలె, వెలలఁబన్నె, [illegible] రొప్పె-౬=ఉచ్చాటనముచేసెను. కనియెను, చూచెను, కనుగొనెను, తిలకించెను, కనెను, కాంచెను-౬=దర్శించెను. తాల్చె, పూనె, ఆనెను, మోచె-౪=వహించెను. అరికట్టె, పోనీక యంకచేసె, ఆఁగె, నిలిపె, తటాయించె, అడ్డగించె, ఆనుకొనె-౭=వారించెను.

సీ. అంటుగైకొనియె ముట్టయ్యెఁ జెఱఁగుమాసెఁ
గడకేఁగె నింటికిఁ గాకపోయె
ననఁగ దూరస్థకుఁ దవరుఁ దానముచేసె
నీళ్లుపోసికొనె మునింగెఁ గ్రుంకె
నన నిమజ్జనమయ్యె ననుటకుఁ దగు మడి
మడుఁగు మడు వనంగ నడరు శుచికి
మైల కట్టుపడుపు మ్రాపన మలినాఖ్య
లగుఁ దల్పు వాకిలి యనఁ గవాట
తే. మున కొనరు నేకతంబు ముంగితన మనంగ
సంతరంగమునకుఁ జెల్లు నక్కఱ పని
యొంజలియు జోలి యనఁ గార్య మొనరు గంజి
వార్పన యువాగు నామముల్ వఱలు సాంబ. 28

మనసరి తెంపరి మొనకాఁడు మిడిమాసి
వడివాఁ డనంగ శూరుఁడు సెలంగు
నని చివ్వ యేత్తెఱ యాలము బవరము
పోట్లాట పెనకువ పోరు కలను
కయ్యము దురము జగడ మన యుద్ధాఖ్య
లమరు మద్దత్తు వెన్నాస తోడు
తే. పాటు సావాసము పరాలు బాసట యన
రాజిలు సహాయమునకు వేరమ్ము కంటు
నూడు పగ దేస మనఁగఁ బొల్చును విరోధ
నామములు సర్వలోకైకనాథ సాంబ. 31

టీ. గడునరి, దిట్ట, ఎక్కటి, వాఁడిగలవాఁడు, వడికాఁడు, పోటరి, బంటు, మేటి, మనసరి, తెంపరి, మొనకాఁడు, మిడిమాసి=వాఁడిగల మనుష్యుఁడు, వడివాఁడు-౧౩=శూరుఁడు. అని, చివ్వ, ఏత్తెఱ, ఆలము, బవరము, పోట్లాట, పెనఁకువ, పోరు, కలను, కయ్యము (ప్ర. కలహము), దురము, జగడము-౧౭=యుద్ధము. మద్దత్తు, వెన్నాస, తోడు, పాటు, సావాసము, పరాలు, బాసట-౯=సహాయము. వేరము, కంటు, నూడు, పగ, దేసము-౫=విరోధము.

సీ. నులిచె వెంపరలాడె నుగ్గాడెఁ దెగటార్చెఁ
జక్కాడెఁ బగదెంచెఁ జంపెఁ జెండె
సదమద మొనరించెఁ జదివెఁ బీఁచమడంచె
నులిమె చాఁగఁబలాడెఁ బిలుకుమార్చెఁ
బరిమార్చె ముగియించె నుఱుముసేసె నడంచెఁ
దుత్తుంచెఁ బొగరుమార్చెఁ దునిమె మడిపె
మన్నిగొనియె రూపుమాపె గీటడఁగించె

మడియించెఁ దూలించె ♦ మలిపె ననఁగఁ

తే. బొనఁగు వధియించె ననుటకుఁ ♦ బ్రోచెఁ బ్రోవె
సాఁకెఁ గాపాడె బ్రతికించె ♦ సంతరించెఁ
బెంచె మనిపె ననఁగను బోషించుట కగు
సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి. 32

టీ. మలిచెను, వెంపరలాడెను, నుగ్గాడెను, తెగటార్చెను, చక్కాడెను, పగదెంచె, చంపె, చెండెను, సవమదమొనరించె, చదిపెను, పీఁచమడఁచె ॥రూ॥ పించమడఁచె, నులిమె, చాఁగఁబలాడె, పిలుకుమార్చె, పరిమార్చె, నుగియించె, నుఱుమునేసె, అడఁచె, గ్రసించె, పొగరుమార్చె, తునిమె, మడిపెను, మన్నిఁగొనెను, రూపుమాపె, గీటడఁగించె, మడియించె, తూలించె, మలిపె-అర్థ=వధించెను, ప్రోచె, ప్రోవె, సాఁకె, కాపాడె, బ్రతికించె, సంతరించె, పెంచె ॥రూ॥ పెనిచె, మనిపె ॥రూ॥ మనిచె, మంచె-గం=పోషించెను.

సీ. ఇచ్ఛ తలఁపు మది ♦ యెద మన సనఁ జిత్త
మగుఁ దమకము మేల్లు ♦ మరులు బాళి
తమి వలపు విరాళి ♦ మమత నా మోహ మా
నాఁడాది యదిసుతఁ ♦ నాఁటనుండి
తలనాఁడు నాఁడుమొదలు నాఁటబట్టి యా
నాఁడునుక్క యదిమొదల్ ♦ నాఁటఁగోలె
యనఁగఁ దదారభ్య ♦ యనుట కౌ మంచి మేల్
బాగు లెస్స యన శుభంబు లలరు
తే. వనట యంగలారుపు వెత ♦ వంత గోడు
బాద యంగద వగ పనఁ ♦ బరఁగుఁ బీడ
పదవి సిరి కల్మి యనఁగ సంపదకు వెలయు
నితము పేరిమిం పన హిత ♦ మెసఁగు సాంబ. 33

టీ. ఇచ్చ, తలఁపు, మది, ఎద, మనసు (ఇది తత్సమప్రాయము)-౫=చిత్తము. తమకము, మేలు, మరులు, జాలి, తమి, వలపు, విరాళి, మమత (ఇది తత్సమము)-౮=మోహము. నాఁడాది, అదిసుత, నాఁటనుండి, తొలినాఁడు, నాఁడుమొదలు, నాఁటఁబట్టి, ఆనాఁడునుండి, అదిమొదలు, నాఁటగోలె-౯=తదారభ్య యనుట. మంచి, మేలు, బాగు, లెస్స-౪=శుభము. వనట, అంగలారుపు, వెత, వంత, గోడు, బాద (ప్ర. బాధ), అంగద, వగపు-౮=పీడ-అనఁగా నొప్పి. పదవి (ఇది తత్సమము), సిరి, కల్మి=౩-సంపద. ఇతము, పేరిమి, ఇంపు-౩=హితము.

సీ. జతవీడెఁ నడసె నాఁ § జను విరహము పేరు
లెనసెఁ బైకొనెఁ బొందె § నేలెఁ గలసె
నన సంగమ మొనర్చె § ననుట కొఁ బొలయల్క
వెడమోడి యనఁ బేర్లు § వెలయుఁ బ్రణయ
కలహమునకు జడ § గాంజ గంజా బంగి
యనఁగఁ గళంజాహ్వ§యంబు లలరు
మబ్బు లాహిరి కైపు§మ స్తన మత్తత
భాసిల్లుఁ దోడును నుం§పడ మనంగ

తే. భోగవనితకుఁ దగు దెంపి § ముసుకు కుంక
మాసక మ్మన విధవనా§మములు సెలఁగు
బైరవాసంబు దోవతి § పంచె యనఁగ
నిల బహిర్వసనాభిఖ్య § లలరు సాంబ. 34

టీ. జతవీడెను, ఎడసెను-౨=ఎడఁబాసెను, ఎనసెను, పైకొనెను, పొందెను, ఏలెను, కలసెను--౫=సంగమము చేసెను. పొలయలుక, వెడమోడి-౨=ప్రణయకలహము. జడ, గాంజ, గంజా, బంగి-౪=కలంజము (గంజాయి). మబ్బు, లాహిరి, కైపు, మస్తు-౪=మత్తత. తోడును- ఉంప

డము-౨=భోగస్త్రీ. తెంపి, ముసుకు, ఱంక, మాసకమ్మ-౪=విధవ, బైర్వాసము ॥రూ॥ బయిరవాసము,దోవతి, పంచె-౪=బహిర్వసనము [బయటివస్త్రము.]

సీ. విచ్చేసె నేతెంచె । వచ్చెను వేంచేసె
నరుదెంచెఁ జనుదెంచె । ననఁగ నాగ
తుని పేరు లగు మగ । తనము మగంటిమి
గండనఁ బౌరుషా । ఖ్యలు చెలంగు
గద్దించె నదలించె । గదిమెను నుఱిమె నా
గర్జించె ననుట శా । గట్టి యుక్కు
చేగ యూట యుదుటు । చేవ యుఱవు బిగు
వన దృఢత్వము పేరు । లలరు జట్టి
తే. విలువ రో వెల యనఁ గ్రయాఖ్యలు దనర్చుఁ
గప్రము సిరంబు గంబూర । కప్పురమన
వెలయుఁ జంద్రంబు వెల్గ్రుక్క । గిలుకుపలుకు
రవపలుకనంగ మణితాఖ్య । లవును సాంబ. ౩౫

టీ. విచ్చేసెను, ఏతెంచెను ॥రూ॥ ఏఁగుదెంచెను, వచ్చెను, వేంచేసెను, అరుదెంచెను ॥రూ॥ అరుగుదెంచెను, చనుదెంచెను - ౮=వచ్చెను. మగతనము, మగఁటిమి, గండు - ౩=పౌరుషము. గద్దించెను, అదలించెను, గదిమెను, ఊఱిమెను-౪=గర్జించె-బెదరించెను. గట్టి, ఉక్కు, చేగ, ఊట, ఉదుటు, చేవ, ఉఱవు, బిగువు-౮=దృఢత్వము. జట్టి, విలువ, రో, వెల - ౫=క్రయము. కప్రము, సిరము, గంబూర ॥రూ॥ గంబూరము-గంబురము. గంబురా, కప్పురము ॥రూ॥ కపురము-౮=కర్పూరము. వెల్గ్రుక్క, గిలుకుపలుకు, రవపలుకు-౩=మణితము-రతికూజితము.

సీ. లేమి పేదఱికము । లేమిడి లేవడి

నిష్పచ్చర మిడుమ § నెవ్వ యనఁగ
దారిద్ర్యనామముల్ § తగు దెస యాత్రము
కడగండ్లు గోరము § కస్తి బెడఁద
యడలు చేటన విపదాఖ్యలు వర్తిల్లుఁ
డెక్క మెగురఁగొట్టె § డింకవేసెఁ
బెద్దనిద్దురవోయె § బిద్దె మడిసెఁ జచ్చెఁ
జనె గంతుకొనెఁ ద్రుంగె § సమసె నేఁగెఁ

తే. గూలె నీల్గెఁ గడసెఁ ద్రెళ్లెఁ § గ్రుంకె బ్రుంగెఁ
దెరలెఁ బోయె ముగిసె దీఱెఁ § దొరఁగె ననఁగఁ
బరఁగు మృతునిసమాఖ్యలు § బవిరి చుట్టు
వేడె మన వలయాభిధల్ § వెలయు సాంబ. 36

టీ. లేమి, పేదతికము, లేమిడి, లేవడి, నిష్పచ్చరము, ఇడుమ, నెవ్వ-౭=దారిద్ర్యము. దెస, ఆత్రము ॥రూ॥ అత్తరము, కడగండ్లు (నిత్యబహువచనాంతము), గోరము, కస్తి, బెడఁద, అడలు, చేటు-౯=విపత్తు. డెక్కమెగురఁగొట్టెను, డింకవేసెను, పెద్దనిద్దురవోయెను, బిద్దెను, మడిసెను, చచ్చెను, చనెను, గంతుకొనెను, త్రుంగెను, సమసెను, ఏఁగెను, కూలెను, నీలిగెను, కడసెను, త్రెళ్లెను, క్రుంకెను, బ్రుంగెను, తెరలెను, పోయెను, ముగిసెను, తీఱెను, తొరఁగెను-౨౨=మృతినొందెను. బవిరి, చుట్టు, వేడెము-3=వలయము.

సీ. గమి పౌఁజు మొత్తము § కదుపు చేరువ బారు
పిండు కూటువ పరి § దండు దిమ్ము
గుంపు తుటుము గుమి § గూటు పదు పనంగ
బృందాఖ్య యగు వెల్లి § వెడలె వెలలె
వెలువడె ననఁ బెళ్లు § వెలయు నిర్గతుఁ డంట

కెన్నఁడు వాలాయ మెపుడు నిచ్చ
లెల్లప్పు డెప్పటి కేప్రొద్దు నెడప కే
నాఁ డెప్పు డుడుగక నాఁ జెలంగు
తే. సంతతాఖ్య కోలము వంగసమ్ము వంగ
డమ్మనఁ గులాఖ్య వర్తిల్లుఁ గ్రమ్మఱ మఱి
మగుడ వెండియుఁ బలుమఱు మరల సారె
తిరుగ ననఁ బునరాఖ్యలు పరఁగు సాంబ. 37

టీ. గమి, పౌఁజు, మొత్తము, కదుపు, చేరువ, బారు, పిండు, కూటువ, పరి, దండు, దిమ్ము, గుంపు, తుటుము, గుమి, కూటు, పదుపు-౧౬=సమూహము. వెళ్లె, వెడలె, వెలలె, వెలువడె-౪=నిర్గతుఁడయ్యె-ప్రయాణమాయెను. ఎన్నఁడు, వాలాయము, ఎపుడు, నిచ్చలు ॥పా॥ నిచ్చ, ఎల్లప్పుడున్, ఎప్పటికిన్, ఏప్రొద్దును, ఎడపక, ఏనాఁడు, ఎప్పుడున్, ఉడుగక-౧౧=సదా. కోలము, వంగసము, వంగడము-౩=కులము. క్రమ్మఱన్, మఱి, మగుడన్, వెండియున్, పలుమఱు, మరలన్, సారె, తిరుగన్-౮=పునః.

సీ. పంద కోఁచ పిఱికి పాటుఁబో తనఁగను
సమరభీరుని పేరు లమరుచుండు
విడియము వీడెంబు వీడ్యము వక్కాకు
తములము బాగాలు తమ్మలంబు
నాఁ జనుఁ దాంబూలనామముల్ కొనియాడె
నగించెఁ బొగడెఁ గొండాడె నెంచెఁ
గైవార మొనరించె నా వినుతికిఁ బేళ్లు
కచ్చ కోరిక కోర్కి యిచ్చ యనఁగ
తే. నిచ్చ కగు రోసెఁ బరికించె నెమకెఁ దడవె
వెదకె నారసె నరసెను వెతకె ననఁగ

దనరు నన్వేషణాఖ్యలు తన్నెఁ దాఁచె
నడుగుతాటించెఁ గాళ్లచే నడిచె ననఁగ
నమరుఁ బదతాడనాభిధానములు సాంబ. 38

టీ. పంద, కొంచ, పిఱికి, పాఱుఁబోతు(పాఱు+పోతు)-౪-యుద్ధభీరువు. విడియము, వీడెము, వీడ్యము, వక్కాకు, తములము, బాగాలు, తమ్మలము-౭=తాంబూలము. కొనియాడె, అగ్గించె, పొగడె, కొండాడె, ఎంచె, కైవారమొనరించె-౬=స్తోత్రముచేసెను. క్రచ్చు, కోరిక, కోర్కి, ఇచ్ఛ-౪=ఇచ్ఛ. రోసె, పరికించె, నెమకె, తడవె, వెదకె, ఆరసె, అరసె, వెతకె-౮=అన్వేషించెను, తన్నె, తాఁచె, అడుగుతాటించె, కాళ్లచేనడిచె-౪=పాదముతోఁ దన్నెను.

సీ. కొమరు చొక్కాటమ్ము గొనబు చొక్కారము
చొక్కము మేలిమి జోక పొలుపు
నాణెంబు సొరు విన్నాణంబు తిన్నన
పరఁగు చొక్క చెల్వు మురువు తనరు
నగు తియ్యపొనరు చెన్నలరు నలువు తీరు
వఱలు జాను చెలంగు కొఱలు నొనరు
చను తగు నొప్పు నెసంగు ననెడు పేళ్లు
తగు మంజులమునకు దండ యొద్ద
తే. చెంత కుఱఁగలి డగ్గఱ చేర్వ పొంత
దాపు సరస కెలను పజ్జ ప్రాపు వద్ద
యండ చక్కి గరిడి యన నమర నొస
మీపనామములు మనోజ్ఞరూప సాంబ. 39

టీ. కొమరు, చొక్కాటము ॥రూ॥ చొకాటము-చొక్కటము, గొనబు, చొకారము, ॥రూ॥ చొక్కారము, చొక్కము, మేలిమి,

తోఁక, పొలుపు, నాణెము, సౌరు, విన్నాణము, తిన్నన, పరఁగు, చొక్కు ॥రూ॥ చొక్క-చొక్కా (ఈ 3 ను, చొక్కమునకు వృత్తిని మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపములు), చెల్వు, మురువు, తనరు, అగు, తియ్య, పొనరు, చెన్ను, అలరు, నలువు, తీరు, వఱలు, జాను, చెలఁగు, కొఱలు, ఒనరు, చను, తగు, అమరు, ఒప్పు, ఎసఁగు-౪౦=మంజులమైనది. దండ, ఒద్ద, కుఱఁగలి, డగ్గఱ ॥రూ॥ దగ్గఱ, చేర్వ ॥రూ॥ చేరువ, పొంత, దాపు, సరస, కెలను, పజ్జ (ప్ర. పశ్చాత్), ప్రాపు, వద్ద, అండ, చక్కి, గరిడి-౧౭=సమీపము.

సీ. పిమ్మటఁ దరువాతఁ బిదప వెన్క వెనుక
 ననఁగఁ బశ్చాదభిఖ్యలు చెలంగు
సడలె వదలె వీలె జాఱె వీడె ననంగఁ
 జ్యుతసమాఖ్య లగు లొచ్చు కొద కడమ
కుఱుచ యొచ్చెము తగ్గు కొంచెము తక్కువ
 కుందు కొదవ లోను కొద్ది యనఁగ
మెఱయు న్యూనతపేళ్లు మిక్కిలి యెక్కువ
 యెచ్చు వెల్లుదనము పెచ్చు మిగుల
తే. హెచ్చనఁగ నధికాభిఖ్య లెసఁగు చుండుఁ
దొలుత ముందర నుఱ్ఱ మున్ను తొల్లి మునుపు
ముందు మున్న తొలి యనఁ జనుఁ బూర్వమునకుఁ
దడవు జాగన నాలస్య మషరు సాంబ. 40

టీ. పిమ్మట, తరువాత (తరువాయి సప్తమ్యేకవచనము), పిదప, వెన్క, వెనుక-౫=అనంతరము. సడలె, వదలె, వ్రీలె, జాఱె, వీడె-౫=చ్యుతమయ్యె. లొచ్చు, కొద, కడమ, కుఱుచ, ఒచ్చెము, తగ్గు, కొంచెము, తక్కువ, కుందు, కొదవ, లోను, కొద్ది-౧౨=న్యూనత. మిక్కిలి, ఎక్కువ, ఎచ్చు, వెల్లుదనము, పెచ్చు, మిగులన్, హెచ్చు-౭=అధికము. తొలుతన్,

ముందర ॥పా॥ ముందఱ, మున్ను, తొల్లి, మునుపు, ముందు, మును, తొలి-౭=పూర్వము. తడవు, జాగు-౨=ఆలస్యము.

సీ. తాఱుమాఱయ్యెను దడఁబడె వీడ్వడె
నని విపర్యాసాఖ్య లమరు సాము
సగము సాఁబా లనఁ దగు నర్ధ మనుటకుఁ
దూఱొనెఁ జొరఁబాఱెఁ దూఱెఁ జొచ్చె
ననఁగఁ బ్రవేశించె ననుటకుఁ దనరారు
మొత్తెఁ గొట్టెను వ్రేసె మోఁదె ననఁగఁ
బ్రహరించె ననుట కౌఁ బనిచె ననిచెఁ బుచ్చె
నంపెఁ బుత్తెంచెఁ బొమ్మనియెఁ బంపె
తే. గెలువు మనె ననఁ బ్రస్థితాఖ్యలు చెలంగుఁ
జాయ పొంతనఁ జోటనఁ బాయ యిక్క
చక్క తావనఁగఁ బ్రదేశసంజ్ఞ దనరు
నంబరనదీలసజ్జటాడంబ సాంబ. 41

టీ. తాఱుమాఱయ్యెను, తడఁబడెను, వీడ్వడెను-౩=విపర్యాసము(తలక్రిందు). సాము, సగము, సాఁబాలు-౩=అర్ధము. తూఱొనెను, చొరఁబాఱెను, తూఱెను, చొచ్చెను-౩=ప్రవేశించెను. మొత్తెను, కొట్టెను, వ్రేసెను, మోఁదెను-౪=ప్రహరించెను. పనిచెను(పోవుధాతుప్రేరణము), అనిచెను, పుచ్చెను (పోవుధాతుప్రేరణము), అంపెను, పుత్తెంచెను, పొమ్మనియెను, పంపెను, గెలువుమనెను-౮=ప్రయాణముసేయించెను. చాయ, పొంత, చోటు, పాయ, చక్కి, తావు-౬=ప్రదేశము.

సీ. అచట నయ్యెడ నందు నిచ్చో నదిగో నట
నచ్చట నక్కడ నకడ నాడ
నావంక నల్లదె యనఁ దత్ప్రదేశాఖ్య

లోదవు ముంగల మ్రోల ✽ నెదుట ముందు
ముందట యనఁగ స✽మ్ముఖము పేళ్లు రహించు
నిరుదెస లిరువంక ✽ లిరుగెలంకు
లిరుపక్క లిరుమైల ✽ లిరుగ్రేవ లిరుగడల్
సూరె లనెడి పేళ్లు ✽ మీఱు నుభయ
తే. పార్శ్వనామముల్ వడసెందె ✽ బాళితాఁకె
మైమఱచెఁ గడపట్టె సొ✽మ్మసిలె ననఁగ
మూర్ఛ కాఁ గికురించెను ✽ మోసపుచ్చెఁ
బిక్కు చేసె నా వంచన✽పేళ్లు సాంబ. 42

టీ. అచటన్, అయ్యెడన్, అందున్, అచ్చోటన్, అదిగో ॥రూ॥ అదె, అటన్, అచ్చటన్, అక్కడన్, అకడన్, ఆడన్, ఆవంకన్, అల్లదె ॥రూ॥ అల్లదిగో-౧౨=ఆప్రదేశమునందు. ముంగల, మ్రోల, ఎదుట, ముందు, ముందట-౫=సమ్ముఖము. ఇరుదెసలు, ఇరువంకలు॥రూ॥ఇర్వంకలు, ఇరుగెలఁకులు, ఇరుప్రక్కలు, ఇరుమైలలు, ఇరుగ్రేవలు, ఇరుగడలు, సూరెలు-౯=ఉభయపార్శ్వములు. వడసెందెను, బాళితాఁకెను, మైమఱచెను, కడపట్టెను, సొమ్మసిల్లెను-౫=మూర్ఛనొందెను. కికురించెను, మోసపుచ్చెను, పిక్కుచేసెను-౩=వంచించెను.

సీ. వెఱ బీతు దిగు లళ్కు ✽ వెఱ పదరు బెదరు
జళు కెద జడుపన ✽ వెలయు భయము
కత్తి వాలడిదము ✽ కైదువు నన ఖడ్గ
మెసఁగు బల్లెము గడ ✽ యీఁటె చివ్వ
యనఁగఁ గుంతాఖ్య లౌ ✽ నామెత పందుగ
పబ్బం బనఁగ నుత్స✽వమున కలరు
వంక వంకర సొట్ట ✽ డొంకన వక్రత

౧౦=కవచము. అరదము, (ప్ర. రథము), తేరు-౨=రథము. హాయలుబం
డి, కొల్లారుబండి ॥రూ॥ కొలారుబండి-కొల్లాబండి-౪=గోశతాంగము (గాడీ).
మునికోల, ఆరెకోల, ముల్లుకోల ॥రూ॥ ములుకోల-౪=తోత్త్రము (ఛబుకు).

సీ. దీవట్లు పంజులు దివ్వటీల్ దివటీలు
దివియ లనం గరదీపిక లగు
నొగ కాఁడిమ్రాఁ కనఁ బగుఁ గూబరము కాన్క
కానుక సూడిదె కప్పం మనఁగఁ
గరము పేళ్లగు గద్దె గద్దియ యనఁగ సిం
హాసననామంబు లమరు గొటిజ
గొల్లెనయు గుడారు గూడార మనఁ ద
బటకుటీరము నొప్పి బాద య
తే. తెగులు తెవు లన రోగాఖ్య లగు
మందరి యనంగ వైద్యనామంబు
దండ చేరు సరము పేరు తావడ
సరి యనఁగ హారనామముల్ 46

టీ. దీవట్లు, పంజులు, దివ్వటీలు, దివ రదీపి
కలు. నొగ, కాఁడిమ్రాఁకు-౨=కూబరము. ానిs,
సూడిదె, కప్పము-౫=కరము (పన్ను). గ ము.
గొటిజ, గొల్లెన ॥రూ॥ గొల్లియన, గుడారు
౬=పటకుటీరము (డేరా). నొప్పి, బ
లు, తెవులు-౫=రోగము. వెజ్జు (ప్ర. వై
దండ, చేరు, సరము, పేరు, తావడ

సీ. సోబె సిబ్బె మనఁ బ
చెఱఁగు చుంగన

నెయ్యి నే చము రన ఁ నెగడు నాజ్యము పేళ్లు
తైలాఖ్య యగు నూనె ఁ తలచము రన
దివ్యచమురు నామిఁదెము నాముదఁ బన
నేరండతైలాఖ్య ఁ లెసఁగుఁ గోపు
సారాయి యనఁ జెల్లు ఁ వారుణీనామముల్
తిలపిష్టమున కగుఁ ఁ దెలికపిండి

తే. గాన్గుపిండి యనంగఁ దగ్రక్రంబు వెలయుఁ
జల్ల మజ్జిగ యన దధిసంజ్ఞ దనరుఁ
బెరుఁగు కలు పన గోరంట ఁ బెల్ల మచ్చు
నా గు[illegible] లగు జగన్నాథ సాంబ. 47

టీ. [illegible]ము-౨=కిలాసము. కొంగు, చెఱఁగు, చుంగు-3=వ
స్త్రముకొ[illegible]॥ నెయ్యి, నే, చమురు-౪=ఘృతము. నూనె, తల
చమురు-[illegible]చమురు, అమిదెము, ఆముదము - 3=ఏరండతై
లము. [illegible]=మద్యము. తెలికపిండి, గాన్గుపిండి-౨=తిలపి
ష్టము. [illegible]ము. పెరుఁగు, కలుపు-౨=దధి. గోరంట, బె
ల్లము[illegible]

సీ. [illegible] ఁ తొడవు లనఁగఁ జెల్లు
[illegible]త్రమునకు రూక
[illegible] ఁ దనరు మేలుతరంబు
[illegible] మీసరంబు
[illegible] శేష్ఠనామంబు
[illegible]గ నావు
[illegible]లకు విం
[illegible]ర లన

తే. జమిడివీచోపు లనఁ జామరములఽకాన
వాతు కల్కండ చక్కెరఽపంచదార
కండచక్కెర మేల్పులఽకండ మనఁగ
శర్కరాభిఖ్య లగు శైలఽచాప సాంబ. 48

టీ. ఒడమెలు (ఇది అఱవపదము), సొమ్ములు (ప్ర. స్వమ్), తొడవులు-౩=భూషణములు. రూక, ధనము (ఇది తత్సమము), రొక్కము (ప్ర. రుక్మము)౩=విత్తము. మేలుతరము, మేల్బంతి, కన్నాకు, మీసరము, తలకట్టు-౫=శ్రేష్ఠము. అనవుడున్, నాఁగన్, నాన్, అనఁగన్, నావుడున్-౫=అనఁగా. వింజామరములు, వింజామరలు, జమిడివీచోపులు-౩=చామరములు. నవాతు, కల్కండ, చక్కెర, పంచదార, కండచక్కెర, మేలుపులకండము.౬=శర్కర.

సీ. సైకము తోడెము ఽ సన్న మన్నువ జిల్గు
వలిపము చిఱు లేఁత ఽ కొలఁది యులఁతి
యసదు లే జీ బన ఽ నమరు స్వల్పమునకుఁ
బెను గొప్ప బలు పేరు ఽ పెద్ద దొడ్డ
గన మన నధికాఖ్య ఽ లొనరుఁ దోరము హెమ్మ
గమక మొ మ్మనఁగ స్థూఽలము చెలంగు
దస్సెఁ గుండె ముడింగెఁ ఽ దాఁకె నుబ్బడఁగెను
సుగ్గెఁ గ్రుంగెను డొంకె ఽ సగ్గె నుక్కెఁ
తే. దగ్గె నన క్షీణదశ కగు ఽ డబ్బు బద్దు
పొల్లు డబ్బఱ తాటోటు ఽ బొంకు రవలి
కల్ల జూ దన ననృతంబుఽపేళ్లు వెలయు
నిలుకడ యనంగ నిరతాఖ్య ఽ నెగడు సాంబ. 49

టీ. సైకము, తోడెము, సన్నము, అన్నువ, జిల్గు ॥రూ॥ జిలుఁగు, వలిపము,

చిఱు, లేఁత, కొలఁది, అలఁతి. అసదు, లే, జీబు-౧౪=స్వల్పము. పెను, గొప్ప, బలు, పేరు, పెద్ద, దొడ్డ, గనము-౭=అధికమైనది. తోరము, హామ్ము, గమకము, ఒమ్మ-౪=స్థూలము. డస్సెను, కుందెను, ముడిఁగెను, తాఁకెను, ఉబ్బడఁగెను, మ్రగ్గెను, క్రుంగెను, డొంకెను, సగ్గెను, స్రుక్కెను, తగ్గెను-౧౧=క్షీణించెను. డబ్బు, బద్దు, పొల్లు, దబ్బర ॥రూ॥ డబ్బఱ, టోటు, బొంకు, టపలి ॥రూ॥ తపళి, కల్ల, జూదు-౧౧=అసత్యము. నిలుకడ=నిరతము.

సీ. ఎంచె గణుతిచేసె నెన్నికనిడె నెన్నె
నన,గ గణించుట కమరుఁ దాల్మి
సైరణ యోర్పన శాంతత పేళ్ళగు
నెమ్మి నెమ్మది హాయి నిమ్మళంబు
నాఁగ నిరాతంక నామము లగు వడ
యలయిక బడలిక యలపు సేద
యనఁగ శ్రమాఖ్యలౌ నగ్గలంబాయెను
మేరతప్పెను మట్టుమీఱె మించె

తే. వెక్కసం బయ్యె నుబ్బవయ్యెఁ గ్రిక్కిఱిసెను
ననఁగ నుత్కృష్ట మనుటకౌ నావరించె
నిండె నెగడె వెలసెఁ బర్వె నిగిడె ననఁగ
వ్యాప్త మయ్యె ననెడిపేళ్ళు కలుగు. సాంబ. 50

టీ. ఎంచెను, గణుతిచేసెను, ఎన్నికనిడెను, ఎన్నెను-౪=గణించుట. తాల్మి ॥రూ॥ తాలిమి, సైరణ ॥రూ॥ సయిరణ, ఓర్పు ॥రూ॥ ఓరుపు-౬=శాంతత్వము. నెమ్మి, నెమ్మది (నెఱ+మది), హాయి, నిమ్మళము-౪=నిరాతంకము. వడ, అలయిక, బడలిక, అలపు, సేద-౫=శ్రమము. అగ్గలమయ్యెను, మేరతప్పెను, మట్టుమీఱెను, మించెను, వెక్కసమయ్యెను, ఉబ్బవ

య్యెను, క్రిక్కిఱిసెను-౬=ఉత్కృష్టమయ్యెను. ఆవరించెను, నిండెను, నెగడెను, వెలసెను, పర్వెను, నిగిడెను-౬=వ్యాపించెను.

సీ. అవసడి యాడిక ♦ యారడి సడి ఱట్టు
    నగడు దూఱు ననఁ నింద ♦ కమరు మాల్మి
యలవాటు వాడుక ♦ యలవడుటనఁ బొల్చుఁ
    బరిచయాభిఖ్యలు ♦ పన్నిదంబు
పందెము జూద మ♦నం దగు ద్యూతంబు
    నిబ్బది నిక్కము ♦ నిలువరంబు
నిజము నిక్కువ మన ♦ నెగడు సత్యము పేళ్లు
    గోర్వంక నెలకూన ♦ గోటినాటు
తే. నా నఖక్షత మగును దం♦తక్షతములు
    కెరలుఁ బలునొక్కు వాతెఱ♦కెంపు పెదవి
    గంటి కెమ్మోవిగుఱి యనఁ ♦ గౌఁగిలి యనఁ
    గవుఁగి లనఁగ నాలింగ నా♦ఖ్య లగు సాంబ. 51

టీ. అవసడి, ఆడిక, ఆఱడి, సడి, ఱట్టు, అగడు, దూఱు-౭=నింద. మాల్మి ॥రూ॥ మాలిమి, అలవాటు, వాడుక, అలవడుట - ౪=పరిచయము. పన్నిదము, పందెము, జూదము ॥రూ॥ జూజము (ప్ర. ద్యూతము)-౪=ద్యూతము. నిబ్బది, నిక్కము, నిలువరము, నిజము, నిక్కువము-౫=సత్యము. గోర్వంక ॥రూ॥ గోరువంక, నెలకూన, గోటినాటు - ౩=నఖక్షతము. పలునొక్కు, వాతెఱకెంపు, పెదవిగంటి, కెమ్మోవిగుఱి-౪=దంతక్షతము. కౌఁగిలి, కవుఁగిలి-౨=ఆలింగనము.

సీ. నాగకేసరులు చె♦న్నంగులు కురువ్రులు
    భోజనప్రియములు ♦ రాజనములు
గన్నెఱు లిప్పపూల్ ♦ గంగాజలంబులు

మట్టకారులు పూలకమంజరీలు
పెద్దవంకలు పాలవెల్లులు ముత్తెపు
సరులు సంబావులు చంద్రవంక
ఏనుఁగుకొమ్ములు మానికములు వన్నె
పూలు సీతాభోగము లన శాలి
తే. ధాన్య మెసఁగును దూము ముంత ముకుసంబు
బల్ల కుంచము సోల తవ్వ పడి యడ్డ
గరిసె పుట్టి సెలగ మెడా కల మనంగ
ధాన్యములు గొల్చువానికి దగును సాంబ. 52

టీ. నాగకేసరులు, చెన్నంగులు, కురువులు, భోజనప్రియములు, రాజనములు, గన్నెలులు, ఇప్పపూలు, గంగాజలములు, మట్టకారులు, పూలమంజరీలు, పెద్దవంకలు, పాలవెల్లులు, ముత్తెపుసరులు, సంబావులు, చంద్రవంకలు, ఏనుఁగుకొమ్ములు, మానికములు, వన్నెపూలు, సీతాభోగములు ఈ గాయను వడ్లవిధముల పేళ్లు. తూము, ముంత, ముకుసము, బల్ల, కుంచము, సోల, తవ్వ, పడి, అడ్డ, గరిసె, పుట్టి, సెలగ, మెడా, కలను - ఈ గరను ధాన్యములు కొలుచు సాధనముల పేళ్లు.

క. ఇమ్మనుజవర్గుఁ జేసితి
సమ్మదమునఁ దీని వినినజనులు భళా చో
క్కమ్మనఁగా నెంతయు నన
ఘమ్మనఁగా మహిని వెలయుఁగావుత సాంబా. 53

తా. ఈమానవవర్గును రచించినాఁడను. ఇది వినునట్టిజనులు 'బళారే యెంత చొక్కమైనది నిర్దుష్టమైనది' అనఁగా భూమియందుఁ బ్రసిద్ధి నొందుసుగాత.

మానవవర్గు - సమాప్తము.

---

# స్థావరవర్గు.

---

క. శ్రీవరదాయక పాయక
దేవరనామాంకితముగఁ దేటపఱచెదఁ
స్థావరవర్గును గవితా
భావరసజ్ఞు లెద మెచ్చఁ బశుపతి సాంబా. 54

తా. సంపత్కరము లగువరముల నిచ్చువాఁడా! పశుపతీ! సాంబమూర్తీ! కవిత్వపుభావమును రసమును నెఱింగినవారు మెచ్చుకొనునట్లు స్థావరవర్గును నెడతెగక నీపేర నంకితముగా విశదపఱచుచున్నాను.

సీ. ఇలతాల్పు గట్టు గుబ్బలి కొండ మల తిప్ప
యన శైలనామంబు లమరు మంచు
టిలతాల్పు వడకుగుబ్బలి దుగ్గికన్నయ్య
గట్లరాయఁడు బేసికంటిమామ
చలికొండ వలిమల పులుచూలితాత నా
హిమగిరినామంబు లెసఁగుఁ బసిఁడి
గట్టు వేల్పులమన్కిపట్టు క్రొన్నెలదారి
సింగిణి యన మేరుశిఖరి వొల్చు
తే. విసపుమేఁతరిబలుటెంకి వెండికొండ
తెలిమల యనంగ రజతాద్రి తేజరిల్లు
బటువుమల తుదగట్టనఁ బరఁగుఁ జక్ర
వాళగిరిపేళ్లు త్రిభువనవంద్య సాంబ. 55

టీ. ఇలతాల్పు=భూమిని ధరించినది, గట్టు, గుబ్బలి, కొండ, మల, తిప్ప- ఇ = పర్వతము. మంచుటిలతాల్పు = మంచుకొండ, వడకుగుబ్బలి=చలికొండ,దుగ్గికన్నయ్య=దుర్గను(పార్వతిని) కన్నతండ్రి,గట్లరాయఁ

డు=పర్వతరాజు, వేసికంటిమామ=శివునిమామ, చలికొండ, వలిమల, పులుచూలితాత=తెల్లుకసవునఁ బుట్టినకుమారస్వామికి పితామహుఁడు - ౫ = హిమవంతుఁడు. పసిఁడిగట్టు=బంగారుపర్వతము, వేల్పుల...పట్టు=దేవతలవాసస్థానమైనది, క్రొన్నె...సింగిణి=లేఁతచంద్రుని ధరించినశివునికి విల్లైనది-3=మేరుపర్వతము. విసపు...టెంకి=విషమును భక్షించినశివునిగొప్పస్థానము, వెండికొండ, తెలిమల=తెల్లనికొండ-3=కైలాసపర్వతము. బటువుమల=గుండ్రనైనకొండ, తుదగట్టు = కడపటనుండుకొండ - ౨ =చక్రవాళపర్వతము.

సీ. కవ్వపుమల తరిగట్టన మందరం
బడరుఁ దూరుపుమల పొడుపుఁదిప్ప
మొదటికొండ యనంగ నుదయాచలం బొప్పుఁ
బడమటిమల క్రుంకుపుడమితాల్పు
నా నస్తగిరి కగు తాఁపు తాకల్లనఁ
బ్రస్తరాఖ్య దలిర్పుఁ బల్లె యూరు
కుప్పం బనఁగ గ్రామ మొప్పును బ్రోలు వీ
డనఁ బట్టణముపేరు లలరుచుండు
తే. నిరవు టెంకి యునికి యిక్క యిల్లు గీము
మనికి పట్టు బిడారు కొంప యిలు నెలవు
నట్టు తావన మందిరనామము లగు
శంబరాహితమదభిదాడంబ సాంబ. 56

టీ.కవ్వపుమల=(సముద్రమును చిలికినపుడు)కవ్వముగానుండినకొండ, తరిగట్టు=(సముద్రమును) చిలికినకొండ - ౨=మందరపర్వతము. తూరుపుమల=తూర్పుదిక్కుననుండుకొండ,పొడుపుఁదిప్ప=ఉదయపర్వతము, మొదటికొండ-3=ఉదయపర్వతము. పడమటిమల=పడమటనుండుకొండ, క్రుంకు

పుడమితాల్పు=అస్తమించు పర్వతము-౧=అస్తగిరి. తాయి, అా, కల్లు-౩=శిల. పల్లె, ఊరు, కుప్పము - ౩=గ్రామము. ప్రోలు, వీడు-౨=పట్టణము. ఇరవు॥రూ॥ ఇరువు, టెంకి, ఉనికి, ఇక్క, యిల్లు, గీము (ప్ర.గృహము)-మనికి, పట్టు, బిడారు, కొంప, ఇలు, నెలవు, నట్టు, తావు(అన్యదేశ్యము)-౧౫=మందిరము.

సీ. టెంకాయచెట్టన టేద్రమాను నారిక
డం బన నారికేళంబు దనరుఁ
దా డనఁ దాళ మా దాళిమ్మ దానిమ్మ
యన దాడిమియుఁ బొన్న పొన యనంగఁ
బున్నాగముఁ దనర్చు గన్నేఱు గన్నేఱు
నాఁగను గరవీర నామము ల
రేఁగు రే నన బదరికిఁ జెల్లు
బిలువ మనఁ దనర్చు
తే. జమ్మి జం బన శమి యగుఁ
దనరు సంపెఁగ సంపఁగె
యుసిరి యుసిరిక యన
యనఁగ రా వన నశ్వ

57

టీ. టెంకాయచెట్టు ॥ ... మాను ॥రూ॥ తే
ద్రమాను, నారికడము-౫=నారి ... (తాటిచెట్టు)-
దాళిమ్మ, దానిమ్మ ॥రూ॥ ... -౨=పున్నాగ
వృక్షము. గన్నేఱు, గ ... -౨=బదరి. మా
రేడు, బిలువము-౨= ... ము. సంపెఁ
గ, సంపఁగె॥రూ ... ౩=ధాత్రి.

సీ. అత్తి మేడి యనంగ నౌదుంబరం బొప్పు
మావి మామి డన నామ్రము దనర్చు
వెలఁగ వెలంగ నా వెలయుఁ గపిత్థంబు
మల్లె మల్లియ నాఁగ మల్లిక యగు
జాజి జాది యనంగ జాతి యౌ నేరేడు
నేరెడు నా జంబు నెగడుచుండుఁ
పాదిరి కలిగొట్టు నాఁ దగుఁ బాటలి
పొగడ పోవ డన నొప్పును వకుళము
తే. మ్రాఁకు మ్రాను చెట్టనఁగ ద్రుమంబు చెలఁగుఁ
దీఁగ తీఁగియ … న తీఁగె యనఁగఁ
దనరు లత పే… నసలు విరులు
పువ్వు లలరు … బు లగు సాంబ. 58

టీ. అత్తి, … ము. మావి, మామిడి-౨=ఆమ్రవృక్ష
ము. వెలఁగ, వెల… , మల్లియ-౨=మల్లిక. జాజి, జాది-
౨=జాతిపుష్పము … =జంబూవృక్షము. పాదిరి, కలి
గొట్టు-౨=పాటలి … ము. మ్రాఁకు, మ్రాను, చెట్టు-
౩=సామాన్యముగా … వ, తీఁగియ ॥రూ॥ తీవియ,
లతకూన (మిశ్ర… త. పూవులు ॥రూ॥ పూలు,
ననలు, విరులు, … =పుష్పములు.

సీ. మొగ… కి యన
న…

దొఱ తొలి తొఱ్ఱ నాఁ | దరుకోటరం బొప్పుఁ
దమ్మి తామ రనఁ గం | జమ్ము పరఁగుఁ
దొగ తొవ కలు వనఁ | దగు నుత్పలమునకు
దట్టంబు జొంపంబు | తఱుచు జీబు
తే. గుమురు తంపర యన ని | బిడము దనర్చు
మొగడ మొగ్గ యనం దగు | ముకుళమునకు
నిక్షుకాండంబునకుఁ బేరు | లెసఁగుఁ జెఱకు
కనులుగలమ్రాను తియ్యమ్రా | ననఁగ సాంబ. 59

టీ. మొక్క, మోటిక ॥రూ॥ మొట్టిక, మొటిక, మోసు, మోక, మొలక-౭=అంకురము. ఇగురు, తలిరు, చిగురు ॥రూ॥ చివురు-౪=పల్లవము. కొన, తుద-౨=అగ్రము. తొఱ, తొలి, తొఱ్ఱ-౩=వృక్షకోటరము. తమ్మి, తామర-౨=తామరసము. తొగ, తొవ, కలువ-౩=ఉత్పలము. దట్టము, జొంపము, తఱుచు, జీబు, గుమురు ॥రూ॥ గుబురు, తంపర-౭=నిబిడము. మొగడ, మొగ్గ-౨=ముకుళము. చెఱకు, కనులుగలమ్రాను, తియ్యమ్రాను-౭=ఇక్షుకాండము.

సీ. తెలుపు తెల్లన తెల్ల | తెల వెల్ల
ధవళవర్ణ మెసఁగుఁ | దొవ
కెంజాయ యెఱు పెఱ్ఱ | కెం
ర్ణ మగు నల్లన కఱి |
నలు పన నీలవర్ణము పా
పసరుచా యన
నళిది పసు పనంగ
తేట నున్న
తే. నిద్ద మన

కళుకు జిగి రంగు మెఱపనఁ గ్ బొలుచుఁ గాంతి
నొడ్డు దరి గట్టనఁగఁ గూలక్ మొనరు సాంబ. 60

టీ. తెలుపు, తెల్లన, తెల్ల, తెలి, వెల్ల, వెలి-౬=ధవళవర్ణము. తొవరు, తొగరు, కెంజాయ (కెంపు+చాయ), ఎఱుపు, ఎఱ్ఱ, కెంపు-౬=రక్తవర్ణము. నల్లన, కఱి, నల్ల, కప్పు, నలుపు-౫=నీలవర్ణము. చామన, పసరుచాయ-౨=శ్యామవర్ణము. అరిది, పసుపు - ౨=పీతవర్ణము. తేట, నున్నన, నున్న, తెలివి, నునుపు, నిద్దము (ప్ర. స్నిగ్ధము)-౬=స్నిగ్ధత. నిగ్గు, డాలు, మినుకు ॥రూ॥ మిన్కు, మిన, మించు, నిగ, తళుకు ॥రూ॥ తళ్కు, మెఱుంగు, చికిలి, కళుకు, జిగి, రంగు, మెఱపు-౧౫=కాంతి. ఒడ్డు, దరి, గట్టు-౩=కూలము-తీరము.

సీ. ఆణి చినుకుఁబూస క్ పాణి సుప్పాణి ము
  త్తెము ము త్తియంబు ముక్త్య మనఁ దనరు
మౌక్తికాఖ్యలు కెంపు క్ మానికము రతన
  మనఁగ మాణిక్యాహ్వయఁబు లలరుఁ
బగడము ... బకనఁగ విద్రుమము పొల్చుఁ
  బక్కి ... క్ పచ్చ యనఁగ
మరకత ... ముగతాలు మూలతా
  లన ... ముకల్లరటుఆయి
తే. కప్పు ... మొప్పుఁ బిల్లు
  పూరి ... ను-గు గడ్డి
గఱి ... తుంగ
వి ... సాంబ. 61

...టైడుపూస, పాణి,

కెంపు, మానికము, రతనము (ప్ర. రత్నము) -౩=మాణిక్యము. పగడము, పవడము-౨=విద్రుమము. పక్కిరాయనిఱాయి, పచ్చ - ౨=మరకతము. మగఱాలు, మూలఱాలు-౨=వజ్రములు. పుల్లంటుఱాయి, కప్పుఱాయి-౨= నీలము. పిల్లు, పూరి, చిగిరింత, ఏట్రింత, పోనుఁగు, గడ్డి, గఱిక, పచ్చిక, వెణుతురు, కసవు (ప్ర.ఘాసము), తుంగ, విడవలి.౧౨=తృణభేదములు.

సీ. ఎల్లి చుట్టువు గోడు | గెండమలు వనంగ
ఛత్రంబు దనరు ధ్వ|జంబు పేళ్లు
టెక్యము టెక్కెము | టెక్కియము సిడం...
పడగ డాలనఁ జెల్లు | నిడివి ని...
సోఁగ నిడుపు చాఁపు | నాఁగ దీర్ఘ...
మఱుఁగు చాటోలము | మఱ...
దగుఁ బిధానాఖ్యలు | జగతి జగ...
యరుఁగ గన వేదిక | కమర...

తే. యిల పుడమి మన్ను బువి ప...
ధరణి కగు విప్పు వెడలుపు | ...
వెడఁద యన విస్తరాఖ్యలు | ...
ససి యనఁగ సస్యనామము ...

టీ. ఎల్లి, చుట్టువు, గో...
టెక్కెము, టెక్కియము, ...
జము. నిడివి, నిడుద, ...
చాటు, ఓలము, మఱు...
రూ॥ తిన్నియ, ...

సీ. మోడు మొరడు మొద్దు ౯ మోటన స్థాణు వౌ
బొఱియ కలుఁగు బొక్క ౯ బొంద లోయ
యన బిలాఖ్యలు చెల్లు ౯ నడుసు బురద ఒంపి
యన లసఁ బంకాఖ్య ౯ లెసఁగు మడుఁగు
మడు వన హ్రద మొప్పుఁ ౯ బోడ వన నున్నతం
బగు గోడ యనఁగఁ గు౯డ్యంబు పొల్చు
సోరణగం డ్లన ౯ మిాఱు గవాక్షము
మా[illegible]ల్. మిద్దెలు ౯ మచ్చు లనఁగ
తే. దా[illegible]ము లౌఁ ౯ దరకసంబు
బ[illegible]ిన యనఁ ౯ బరఁగుఁ దూణి
[illegible] బెత్తె ౯ పెట్టియ యనఁ.
[illegible]ణ౯పేటి సాంబ. 63

[illegible]డు, మొరడు, మొద్దు, మోటు-౪=స్థాణువు.
[illegible] కలుఁగు, బొక్క, బొంద. లోయ-౭=
[illegible]పి, అసలు-౪=పంకము. మడుఁగు, మడువు-
[illegible]గు - ౨=ఉన్నతము. గోడ=కుడ్యము.
[illegible] గవాక్షము. మాడుగులు ॥రూ॥ మాడు
[illegible]గృహములు. తరకసము, బత్తళిక,
[illegible] పెత్తె, పెట్టియ-౪=పేటిక.
[illegible] మాద్రి

బల్యంకికాఖ్యలు । పరఁగు లాలి
యుయ్యాల యుయ్యేల । యూయెల తొట్ల జో
ల యనఁగ డోలికాహ్వాయము లెసఁగుఁ
తే. గంకటియు మంచ మనఁ జెల్లు । ఖట్వమునకుఁ
బీఁట పలక యనఁగ నొప్పుఁ । బీఠమునకు
బరణియుఁ గరాట మనుపేళ్లు । భరణి కమరు
నిచ్చెన యనంగ నిశ్రేణి । నెగడు సాంబ. 64

టీ. ఎన, జోడు, సాదిరి, ఈడు, పురుడు, మాద్రి, సాటి, పాటి, తరముఁదీటు, దినుసు, సరి, ఉద్ది, ప్రతి, దిన్సు, సవతు, పోలిక, నొర, జత - ౧౯ = సదృక్షము. పల్లకి, పల్లకీ, పాలకి, పాల్కి - ౪ = పల్యంకిక. లాలి, ఉయ్యాల॥ రూ॥ ఉయ్యాల, ఊయాల, ఊయల, ఉయాల, ఉయ్యేల॥ రూ॥ ఉయ్యెల, ఊయేల, ఊయెల ॥ రూ॥ ఉయేల, తొట్ల, జోల - ౧౩ = డోల. కంకటి, మంచము - ౨ = ఖట్వము. పీఁట, పలక - ౨ = పీఠము. బరణి, కరాటము - ౨ = భరణి. నిచ్చెన = నిశ్రేణి.

సీ. ఉలి యుక్కిను మనఁగ । నొనరు ... ృంజ్ఞ
చెంబు రాగి యనఁ దా...
దగరము కరుగు డోకనఁగ సీస...
గాంస్యంబు వ్రిల్లుఁ । ...
ద్రపునామ మమరుఁ బెక్క...
గుండులు చట్లు మూ...
కడవలు బానలు । పెడ...
భాండముల్ ...
తే. శైవలం బగు...
వెలయుఁ గ...

తిరుకొళం బన సరసికిఁ ✽ బరఁగు వాఁక
యేఱు వంక వాఁ గనఁ బేరు ✽ లెసఁగు సాంబ. 65

టీ. ఉలి, ఉక్కు, ఇనుము-౩=అయస్సు. చెంబు (ఇది అఱవము.) రాగి-౨=తామ్రము. తగరము, కరుగుడు-౨=నీసము. కంచు=కాంస్యము, పిత్తళి- ఇత్తళి॥రూ॥ఇత్తడి-౩=త్రపువు. కుండలు (సామాన్యముగా పాత్రము), చట్లు (నోరువెడల్పుగానుండునవి). మూఁకుళ్లు(మూఁతిపెట్టెడునవి), బుడ్లు(సన్ననినోరుకలిగి పొడుగుగాఉండునవి),కడవలు(నీళ్లుతోడుబిందె), బానలు(చిన్ననోరు పెద్దకడుపునుగలవి),పిడతలు(చిన్నగిండిచెంబువంటివి), వెసళ్లు (వండుటకుఁ దగినవి)-౮=భాండములు. నాఁచు, పాఁచి ॥రూ॥ ప్రాఁచి-౩=శైవలము. నూతులు, బావులు-౨=కూపములు. గుంట, కొలను, కొలఁకు, తిరుకొళము (ఇది అఱవపదము)-౪=సరస్సు. వాఁక, ఏఱు, వంక, వాఁగు-౪=నది.

సీ. మీల్ మీలు చేఁపలు ✽ మీనులు తెఱగఁట్లు
మచ్చెము లనఁ జెల్లు ✽ మత్స్యములకుఁ
దాఁబేలు [illegible] ✽ నాఁ బొల్చుఁ గూర్మము
నె[illegible]న ✽ నెసఁగుఁ గర్కి
యో[illegible]నొనరు నావకు వాన
[illegible]ర్గమున కలరు
[illegible] నొప్పుఁ గరకలు
[illegible]సు వనంగ
[illegible] కురుజు తేనె
[illegible]
[illegible]బు 66

